# మా ఆశయాలు

మధుర మధురమైన విశ్వమానవజీవిత వసంతానికి మా "కల్పతరువు" తయారైంది. విజ్ఞాన శకుంతాలు నానా దిగంతాలనుంచి వచ్చి అమృతకవితాగానం ఆలాపిస్తూ దీని సహస్ర శాఖాగ్రములమీద మకరందవర్షం క్రుమ్మరిస్తై.

ఇది రసమనోహరలోకం. విశ్వమహాజన మనస్తత్వాలు మార్పుల్లోకి వస్తున్నప్పుడు వివిధరసప్రవాహాలు దూకులు పెడుతూ వుంటై.

ఇటువంటి విశ్వమహాజన పరిణామదశ రసగంగా ప్రవాహంలోనే యీ రామాయణ భారతాలుసారవంతమైన లంకభూములైనై. వీటిమీదే నేటిదాకా యెందరెందరో సాహిత్యక ర్షకులు బంగారు పంటల్ని రత్నాలపంటల్ని పండించి రాసులు పోస్తున్నారు. ఈ "కల్పతరువు" కూడా యీ పొలాలగట్టుమీదే తలెత్తింది. దీని కాపు కొంత క్రొంగ్రొత్త తరహాగా దిగింది.

అసలు కష్టసుఖాలు సమత్వదృష్టితో గ్రహించి, సహించి జీవితాన్ని నడుపుకొంటున్నవాడు పురుషోత్తముడౌతాడు. అంత పురుషోత్తముడు తదేకదీక్షతో తాను విశ్వకళ్యాణం కొఱకు ఏదైనా ఆలోచించి అన్వేషించడానికి దిగినప్పుడు చెప్పనలవికాని కష్టాలపాలై దిక్కుమొక్కులేని అడవుల్లో పడతారు. అంతటి ఘోరారణ్యకష్టాలగ్గాడా తట్టుకున్నప్పుడే గమ్యస్థానం తనకు

చూపించటానికి, తనను కృతార్థుణ్ణి గావించటానికి, విశ్వవిజ్ఞాన షాలలోచనుడైన జీనియస్ తోడుపడతాడు. కూలి రైతు శ్రమ జీవుల కష్టంతో స్వర్గలోకాన్ని భూలోకానికి తెచ్చేటందుకు "కారల్ మార్క్స్" తత్వవేత్త తత్వాన్వేషణ చేసి చేసి పడరానిపాట్లు పడి పడి తుట్టతుదకు తనకు "ఎంగెల్స్" మహామహుడు తటస్థ పడి తోడుపడి తనను కృతార్థుణ్ణి చేసినట్లుగా, నేను చూపిస్తున్న రామాయణకథామార్గంలో పడరానిపాట్లు పడి పడి సీతాన్వేషణకై భయంకరారణ్యం గాలిస్తున్న శ్రీరామచంద్రుడికి త్రిలోచనుడైన శివుడు వీరాంజనేయుడుగా తటస్థపడి, సహాయపడి గమ్యస్థానానికి చేరుస్తాడు. అంటే మానవుడు నానా కష్టాల్ని సహించి చెక్కు చెదరని ఏకైకలక్ష్యంతో నడుస్తున్నప్పుడు పురుషోత్తము డౌతా డన్నమాట. ఇటువంటి పురుషోత్తముడే అవతారమూర్తియై విశ్వ మహాజన శాంతి సౌఖ్య జీవనాలకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంస్థాపన చేస్తాడు. ఇటువంటి అవతారమూర్తికి ఫాలాక్షుడైన పరమశివుడు దాస దాసానదాసుణ్ణని బహువినమ్రుడై దగ్గరకు చేరి సేవచేస్తుంటాడు.

అసలు సుగ్రీవుడు తనదగ్గర బంటుగావున్న ఫాలాక్షుడైన హనుమంతుణ్ణి తాను గుర్తించలేనంతకాలము బంటుగా వున్న హనుమంతుని కేవలం కోతిగా చూడబట్టి వాలిచేత తాను దెబ్బ తిన్నాడు. ఆమాదిరిచూడబడిన హనుమంతుడు తన దివ్యజ్ఞానత్రిలో చనముతో శ్రీరామ లక్ష్మణుల్ని అవతారమూర్తులుగా తెలుసుకో గలిగాడు. అట్లాగే స్థితప్రజ్ఞత్వంతో పురుషోత్తములై దివ్యజ్ఞాన చక్షువుతో రామలక్ష్మణులు హనుమంతుణ్ణి పరమశివుడుగా గ్రహిం చారు.

ఈ లోకంలో కొంతమంది విశ్వమహాజనసేవకోసం ఏకైకలక్ష్యంతో పడరానిపాట్లు పడి అడవుల్లో పడిపోతున్నప్పుడు పరమశివుడు ఏదో గ్రహించలేని రూపముతో వచ్చి దగ్గర దాస దాసాన దాసుణ్ణని చెప్పి అణకువతో సేవచేసి అపూర్వమైన సహాయం చేస్తున్నప్పుడు తెలుసుకోలేకపోతున్నారు. ఇది ప్రత్య క్షానుభవంతో చూచి చెబుతున్నవిషయం.

ఇటువంటి సమన్వయజ్ఞానభాగ్యంతో నేను పరమశివుడైన పీరాస్వామీజీ కటాక్షంతో లక్షపద్యాలు వ్రాసి, యీరామాయణం కొనసాగచేయ సంకల్పించుకొన్నాను. సంకల్పమాత్రమేగాక తదేకదీక్షతో రామాయణరచన సాగిస్తున్నాను. దీనికి కృతిపతులైన, మహాదాతలైన మైకొకింగ్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ జీవియస్ నాయుడుగారు భగవత్ప్రీత్యర్థముగా శతసహస్రవిధాల నాకు తోడుపడి నాకు స్వామీజీ కటాక్షం అనంతంగా ప్రసాదించిపెట్టి శాశ్వతమైనజీవనం ప్రసాదించారు. శ్రీశ్రీ జీవియస్ నాయుడుగారికి వారి గోగినేనిభాగ్యలక్ష్మమణి సంతానానికి పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్యభాగ్యము లిచ్చి రక్షించుగాత అని నా శతసహస్ర భక్తి కవితాకిరణాలు అభిషేకించి ప్రార్థిస్తున్నాను.

ఆంధ్రబెర్నార్డ్‌షా - వేదాంతకవి.

# విజ్ఞాపన

నాచే రచింపబడిన యీ కల్పతరువులోని పద్యాలుగాని, భావాలుగాని, ప్లాట్సుగాని నా లిఖిత పూర్వకమైన అనుమతి లేనిదే ఎవ్వరూ, ఎక్కడా, ఎవ్విధముగా తమ స్వంత లాభాలకోసం ఏ వ్యాపారాల్లోను వాడుకొనకూడదు. అచ్చొత్తించకూడదు. దీనికి వ్యతిరేకించినవారు నా నష్టముక్రింద నేను తెచ్చు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

కవితాసంస్థానం
విజయవాడ.

ఇట్లు
ఆంధ్రబెర్నార్డ్‌షా-వేదాంతకవి.



కృతిప :



మహాదాత మెకానింగ్ శ్రీ టీవియస్ నాయుడుగారు.

# కృ తి ప తి

## మైకాకింగ్ : జీవియస్ నాయఁడు

శ్రీకావ్యేందిర వేంకటేశ్వరుని
రాజీవాక్షునిం గొల్చి లో
కైకశ్రీలలనాలలామ ధిషణా
హేలామణి శ్రీ కళా
ప్రాకార శ్రుతిపక్వవిశ్వమహతీ
రాగామృతాంభోధి మా
మైకాధీశుని గోగినేని కుల
హర్మ్య శ్రీపతిం జేయుతన్ ॥

ఇంత దిగంతకీర్తి సుమియించి
సమస్త ధరాపురంధ్రి సం
క్రాంతియొనర్చు జీవియసునాయుఁడ!
తావక దర్శనమ్ము వే
దాంతకవి ప్రదర్శనము నచ్చెరువౌ
సుముహూర్త మిద్ది ది
గ్దంతులు వజ్రహారములుఁ గైకొని
నీ మొగసాల నిల్వగా ॥

ఎవ్వాని కకుబంత హేమంతకీర్తి
శుభ్రజ్యోత్స్నకు మురిసిపడనివాఁడ
ఎవ్వాని ఘనవజ్రహిమశైలనిభరత్న
కోటులయిన లెక్కఁగొననివాఁడ
ఎవ్వాని విద్వన్మహిమ కథామృతఝరికేని
కొట్టుకొనుచుఁ బోనివాఁడ
ఎవ్వాని సౌందర్యహేలావిలాసైక
భోగములకు పొంగిపోనివాఁడ
శత సహస్రకోటి సువర్ణసదమల శత
పత్రసుందరీమణిఘృణీ ధాత్రికైన
పట్టువడనట్టి వేదాంతవాణివిభుఁడ
నీ యశ మదేమొ నను దెచ్చె నాయుఁడయ్య॥

నీ హృదయం బదెట్టి నవనీతము
వెట్టి తయారుఁజేసెనో
మోహనరూపురేఖలు గుబుళ్ళను
బెట్టి సుఖైక దివ్య స
మ్మోహనశక్తి కుల్కు నగు
మో మొలికించెడి వాగ్విలాస స
న్నాహములెల్ల జీవియసునాయుఁడ!
యెంత యమూల్యరాసులో ॥

ముసినవ్వు బంగారు పూలరేకులమీద
మీ పేరు లిల గుసుమించెనయ్యా
బ్రహ్మాండమైన వజ్రాలవాహినిపైన
మీ జాతకపునొక మెఱసెనయ్యా
మహిపైన నేఁడు కోటి హిమాలయమ్ములై
మీ కోటకొమ్మలు మించెనయ్యా
వితరణవీధి కల్పతరువు శాఖలై
మీ కరములు పైకి దూకెనయ్యా
మీ యఖండ యశోమహనీయ దివ్య
నవ్య కలశపాథోరాశి నాట్యములకు
భూనభోంతరాళములు మార్మోగెనయ్యా
జీవియస్నాయుఁడా! మీకు చెల్ల రెవరు ॥

భువిపై వేంకటసుబ్బయాభిధ!
జనంబుల్ మెచ్చగా మోతిలాల్
ధవుఁ డార్జించిన కోట్లకంటె నవరత్న
శ్రీ సుధాంభోధిగా
జవహర్లాలును గాంచి సద్యశము
దేశాలన్నిటం నింపిన
ట్టి వికాసమ్మున గొప్ప జాతకము
వట్టెం నీకు నీకోటకుఁ ॥

ఏ యుగమం దెవండు గడియింపని
నింపని వజ్రరాశి బా
బో! యిఁక కృష్ణయొద్దుపయిఁ బోతువు
చూతువు విశ్వభాగ్యల
క్ష్మీయుగళంబు క్రొంబసిఁడి మేరువు
వోలె ఘనంబు; జీవియస్
నాయుఁడ! భాస్కరోదయవనాలుసుమా
తొలికోడి గొంతులో ॥

లక్షలు కోట్లు నీ పదతలంబున
నెక్కడ డాగియున్నవో
అక్షయమైన తావక మహత్తరజాతక
వజ్రరేఖలై
లక్షలువెట్టి కట్టిన కళానిలయంబులు
నీదుపేర పెట్ట
రక్షణకల్గి జీవియసునాయుఁడ
నేఁడు మతెన్ని వెల్గెనో ॥

తీయని తెన్గుగడ్డ గణుతించెడి
పేరునబడ్డ జీవియస్
నాయుఁడు జీవియస్ప్రజకు నాయకుఁ
డింక ధనంబుహెచ్చి మై
కాయుగరాజరాజ ఘనకౌశల
పేశల విశ్వకార్యధౌ
రేయుఁడు మానికొండ పెనురేగడ
మీగడఁజేయు కీర్తితో ॥

నకలుగ నేఁడు జీవియసునాయునితో
మన గడ్డపైన కో
టికి పడగెత్తి కీర్తి నివటిల్లెడి
పెన్ధనతల్లజుండు లె
క్కకు నొకఁడైన కన్పడఁడు;కన్పడుచో
విఁక ఆంధ్రరాష్ట్రి సి
ద్ధికి మనమే ప్రదక్షిణము దీనముగా
నొనరించఁబోముగా ॥

అందఱిలోని జీవి యొకఁడైనను
కొందఱిలోని జీవి గో
విందగతుస్సనుం, ఘనవివేక
ధనుర్వివిధ వైకధారుణీ
నందనమందు జీవియసునాయునిలో
గల జీవి యస్సనున్
వంద శతాబ్దముల్ వఱకు బంగరు
వెన్నెల రేకులెత్తఁగా ॥

కదవకుఁగొల్తురేని త్రిజగంబులు
వట్టవి గోగినేని వం
గడమున దేల్చు సద్యశము నాల్గు
యుగా లిక చాలవేమొ, యె
క్కుడయిన తత్కులైకమణిక్రమ
వినమ్ర మయూఖుఁడైన నా
యఁ డడుగు పెట్టినం పసిఁడియై
మడుగుల్ వడు పున్నెమెట్టిదో ॥

"జీ"యను గౌరవాఖ్య తమ చేరువ
        కెప్పుడొ యింటిపేర శ్రీ
ఛాయగ వచ్చె "వీ"యను ప్రశస్తి
        మహావిజయైకభేరితో
మీ యిలువేల్పు పేరనుసుమీ
        యపుడెప్పుడొ వచ్చె.నింక యస్
న్యాయము నీదుపేర శుభమౌనని
        వచ్చెను జీవియస్ప్రభూ ॥

నా కవితాప్రసూన నయనంబులలో
        భవదీయ మాధురీ
పాకము కర్గిపోసిన ప్రపంచ నియంత
        మతెంత చాతురీ
ధీకుశలుండొగాని తియ తీయని
        నీ శుభసుందరాకృతిన్
రేకయి కల్వరించి కనుతెప్పలు
        వాల్పదు జీవియస్ప్రభూ ॥

మది నెంతో తనకోసమై "పలకనామా
 పాలెసుం" మించిన
ట్టిది కట్టించెడి దిట్ట వీ వనుచు
 దృష్టిం నీపయిం బెట్టుకొ
న్నది నా కావ్యకళాకుమారి ఎటి
 యన్నం బేమిటోగాని ము
ట్టదు నిన్గాంచినదాది కమ్మకులశ్రేష్ఠా!
 కొంచె మోదార్చుమీ ॥

ఇది బృందావనమందుఁ బూచిన కళా
 హేలావిశాలాక్షి కం
ఠె దిలాసాగలదై వసంతమృదుకంఠిం
 మించు రాగామృతం
బు దిగంతంబులదాఁక నింపినదియై
 మోహంబుఁ గొల్పించి నీ
మెదడుం దేటఁగఁజేయు జీవియసుస్వామీ!
 నా సుతం సాకుమీ ॥

రాములు రాయలై రసపురందరులై
 దయఁబెంచి యీ కవి
స్వామి పసిండిపంట రఘువంశముతో
 గొలిపించి సద్యశో

రామసహ్రస్రకోటినవరత్నకళా
కమనీయరాశి యీ
నాముగ నిచ్చె జీవియసునాయుఁడ
నీకు పరిగ్రహించుమీ ॥

ముసిముసినవ్వులో విఱగఁబూచెడి
కమ్మని మల్లెపువ్వులోఁ
బసిఁడిగఁ బుట్టి నా కవనబాలిక
నీ మృదుమాధురీ కళా
కుసుమ పరీమళమ్ములను గుప్పగ
వచ్చినదయ్య! నీ కృపా
రసమున జూచుచో బ్రతుకురా!
శుభసుందర! జీవియస్‌దొరా ॥
కృతిపతివై నందన క
ల్పతరువు నీ యింటిముందు బ్రహ్మాండముగా
లతలల్లించితి నీ కే
మి తక్కువయ!నాయుడయ్య! మేరువువయ్యా!

కవితా సంస్థానం
విజయవాడ
9—1—52

'ఆంధ్ర బెర్నార్డ్‌షా'
వే దాం త క వి

# సాక్షాత్కారం

శ్రీరామ లక్ష్మణులు లో
కారాధ్యులుగా నరణ్య మా భూసుతకై
ఘోరశ్రమ గాలించుచు
హైరానయి వచ్చుచుండి రాళలపాలై. 1

చెకచెక సాగుచుం గటికచీకటిలో
బడినట్టి బ్రహ్మ సృ
ష్టికిఁ దొలికోడికూఁత నవజీవమువోసి
ప్రయాసతోడ దా
రికిఁ గదలించుచుండఁగ స్మరించుచు
లేచిన కాకిగోలతో
తికమకయై ప్రభాత సుదతీమణి వచ్చె
విభూషితాంగియై. 2

కిష్కింధాపుర సార్వభౌముఁడగు
సుగ్రీవుండు పెన్భీతితో
శుష్కీభూతశరీరుఁడై గడపి రోజుల్
ఋష్యమూకమ్ముపై
నిష్కాపట్యమనస్కులై చనెడి
క్షోణీపాలురం గాంచి త
త్కిష్కింధాపురి వాలియేమొ యని
చింతించెం భయభ్రాంతితో. 3

జీవములన్ని యింక నలచేతికిఁ
గైకొని కుందుచున్న సు
గ్రీవుని జూచి మారుతి పరిభ్రమఁ
జెందకుఁడంచుఁ బల్కి త
ద్భూవరు లెవ్వరో కని విభూ !
యరుదెంతునటంచు నేగె వి
ద్యావినయమ్ముతో మృదుసుధారస
గానముతో వినమ్రుఁడై. 4

భువనము గోటనెత్తెడి యపూర్వ
మహాబలవంతుఁడై స్వధ
ర్మ విజయుఁడై జగాన హనుమంతుఁడు
నిర్మల రాజభక్తితో

స్తవములొనర్చి భద్రగిరిచంద్రుని
చల్లని ప్రేమభాగ్యముల్
కవనము లల్లి మంజులకళామృదు
గానములెల్లఁ జేసెరా. 5

కోరికలేనివాఁ డయినగూడ
యజస్రము రామసేవతో
తీరిక లేనివాఁడయి, విధేయతగాఁ
గడగండ్లు సైచి మి
న్నేరులు లేపు వానరుని కే
నరుఁడై ననుగాని త్రాసులోఁ
బేరున కింక తూగఁగల వీరుఁడు
కాగలఁడా ధరిత్రిపై. 6

కడు సంరంభముగా నయోధ్యదొర
యీ క్ష్మా రాజ్య పట్టాభిషి
క్తుఁడు కాఁబోయెడివేళ తండ్రి వరవాక్కుల్
బీరువోకుండ కా
ఱడవుల్ పట్టుటజేసి యింత కపిరాజై
వెల్గు పీ...ంజనే
యుఁడు గానంబున రామభక్తిబల
ధుర్యుండై ప్రశంసించెనా? 7

రత్నమాణిక్యకిరణ తోరణమ్ములు
రామనామాక్షరధామనిధులు
వింధ్య హిమాలయ విద్యాధరఘనులు
భద్రాచలస్వామి భజనపరులు
గంగాతరంగ తురంగమాతంగాలు
పట్టాభిరాముని వారువాలు
కాంతారకమనీయ సంతానభాగ్యాలు
జానకీపతి వజ్రశాసనాలు
దివ్యబృందావనసరస్సు దిగులువడెడి
రాఘవేంద్రచరణ సువర్ణకమలాలు
ప్రాణములు నా కటంచు పరవశమంది
యింత హనుమంతుఁ డడవి గల్లంతుపెట్టె 8

తరువుల్ సైతము భక్తిలోఁ బరవశత్వం
బొందెనోయేమొ.వా
నర శార్దూలముతో సమానముగ
బల్ నాట్యమ్ములం సల్పుచున్
గురిపించెం సుమవృష్టి రామవిభునిం
గొండాడి.త ద్దివ్య సుం
దరసుస్నిగ్ధకిశోరమూర్తి యిఁకఁ
గంటంబడ్డ యెట్లుండునో. 9

ఫెళపెళ పెట్టుచేమలు కపిప్రము
ఖుం డెగఁబడ్డ వెంటనే
గళమును విప్పి చెప్పిన వఖండ
మృదంగ తరంగ భంగిమం
బులు, నెలయేటి కన్నెలకు; ముద్దులు
పూచెడిరీతిగా జయం
బులు మృదుగీతికామధురముల్
చిగిరించె కళాళకుంతముల్ 10

ఆ రాముఁ డెంతవాఁడో
ఆరామముగా నరణ్య మాహ్లాదముతో
వీరాంజనేయుఁ డెత్తఁగ
భేరీభాంకృతులుచేసె భీకరమృగముల్ 11

ఈ కపికుంజరుండు భజియించెడి
చల్లని రామనామ సు
శ్లోక సుధాస్రవంతి నవశోభితమై
ప్రవహించి సర్వ లో
కైకమనోజ్ఞమై గహనమెల్ల
మహేంద్రమహోత్సవంబుతో
నాకమొనర్చె దాశరథి నమ్మిన
తమ్ముఁడు వచ్చుచుండగా ॥ 12

సీతాన్వేషణకై సహోదరునితో
శ్రీరామచంద్రుండు వి
ఖ్యాత శ్రీ శ్రవణాఖ్య సాచుకొని
ఘోరారణ్య మార్గశ్రమం
బేతన్మాత్రముగూడ చూచుకొన
కుం దేతెంచుచుండంగ, దా
పైతన్మారుతి రామగానమృదు
గీతాలాపనల్ తాకెరా ॥ 13

వినిపించి రామనామము
తనిపించి మనోజ్ఞగాన తారుణ్యము త
జ్జనకాత్మజ దిక్కెచ్చట
వినిపించని చనిరి వారు కడువేగముతో॥ 14

రామా! సద్గుణధామ! నీ కరుణ
సంప్రాప్తించు నే జన్మకో
రామాయన్న కపీంద్ర సంస్తుతులు
శ్రీరాముండు తల్లక్ష్మణ
స్వామిం విన్మనె, సీతకంత మనిపించం
జొచ్చు విభ్రాంతినిన్
రామస్వామి పదారవిందములు
కాంతారమ్ము పూజించగా ॥ 15

సంగీతాగమదైవమైన హనుమ
స్వామి ప్రమోదమ్ముతో
పొంగుల్ వెట్టెడి రాగజాహ్నవి కళల్
పుష్పించి క్రొత్తావి గు
ప్పుంగం కమ్మని పంచమస్వరముతో
భావించె రాముండు సా
రంగస్థాయిని జానకీరమణి
గాత్రంబంచు నాత్రంబుతో॥ 16

శ్రీరామ దర్శనము మా
ఘోరారణ్యముల కెప్డు కూడునొ యనుచున్
మారాము వెట్టు చిట్టుల
భూరమణుని నడ్డగించె పొదరిం డ్లెన్నో॥ 17

సీతమతల్లి జాడ సరసీరుహ
నేత్రుఁడు చూడఁబోవు పె
ల్లాతురతో నికుంజనిలయావళినిం
బతిమాలి యెంతయో
చేతము తల్లడిల్లెడియుసిం జనగా
హనుమన్న తీయు సం
గీతము డెంద మింక తటిగెం జెటిగెం
పెనుఱంపకోతగా॥ 18

మధుర మధురమైన మామిడిపండులో
రామనామము తీపి రాదురాదు
ఘుమఘుమలాడెడి కుసుమగుచ్ఛంబులో
రఘువీర గంధంబు రాదురాదు
ఫళఫళా మెఱసెడి తారకాధిపతిలో
రామచంద్రుని చల్వ రాదురాదు
వడివడిగా దుమికెడి యేటి పరుగులో
రామకటాక్షము రాదురాదు
కేల నవలీల కోటి హిమాలయాలు
పొఱవైచెడి కోదండపాణి ముందు
మేదినీబలగర్వ సమీరుఁ డెవఁడు ?
రామునికి రాముఁడే సాటి భూమిపైన॥ 19

అతఁడే నా యిఱువేల్పు నిక్కముగ
నా కాతండె లోకైక స
న్నుత సమ్మోహన చక్రవర్తి యతఁడే
మూల్వాసి పేర్వాసి న్యూ
నతలేకుండ వెలుంగు నా భువన
మందారప్రసూనోదయ
ప్రతిభావంతుఁ డనంతకోటి జగదా
రాధ్యుండు రాముండురా॥ 20

ఇట్లాత్మారామస్తుతి
చెల్లెక్క యొనర్చి మోడ్చి చేతులు కపి స
ద్రమాట్లుండ రామచంద్రుఁడు
పాల్లె సాక్షాత్కరించె వరలక్ష్మణుతో॥ 21

వనచరుఁడైన వానరుఁడు భక్తి
రసాబ్ధి నిమగ్నుడై చెలం
గినకతముం బరాత్పరుఁడు కేవలముం
నరుడై మహాటవీ
వనరుహకోటిమధ్య పలుబాముల
పాలయియున్న హేతువున్
గనుగొని విశ్వమోహనముగాఁ బులకించె
నజాండభాండముల్॥ 22

శిల లేడ్చి జీవనదులై
చెలువారెడి రామనామ జీవనములతో
బలశౌర్య భక్తిభాగ్యము
చలచిత్తపు కోతి కిచ్చి సాకినవేమో॥ 23

వాలము మూవుపైన కరవాలముగా
ధరియించి వీర లాం
గూలుఁడు కేలుమోడ్చి [illegible]తకోటి
హిమాలయదేహపుష్టి మా
ర్మ్మలను దాచిపెట్టి కనుబొమ్మలు
నమ్రతనిచ్చు నొంటి మో
కాలును వంచి కూర్చుని జగాలు
చిగిర్చు జపాలు సల్పెరా॥ 24

ఈ హనుమంతుఁ డంత జగదేక
పరాక్రమవంతుఁడై మహో
బాహువులం వినమ్రతగ వంచి
నుతించి సహస్రవిశ్వ స
మ్మోహనరూపమైన నగుమోముని
రామునిగాంచి భక్తి సం
దోహము వెల్లువై దుమికి దూకెడి
గానముఁ జేసె హాయిగా॥ 25

ఎన్ని యుగాలనుంచి గడిఘుంచిన
భక్తిరసప్రవాహమో
కన్నులపండువైన త్రిజగత్ప్రభు
వక్కడ కాలుమోపి లో

కోన్నతశక్తిఁ జూపి సుముఖోజ్వలుఁడై
తిలకింపనంతనే
మిన్నును ముట్టె భీకర సమీరకుమార
వినోద హర్షముల్॥ 26

ఆ పవనాత్మజుండు కుసుమాంజలితోఁ
బ్రణతుల్ ప్రఫుల్లవా
ణీ పదకింకిణీమృదుఘృణీమకరంద
మరందబిందువుల్
తీపిగనిచ్చి మెచ్చుచు విధేయతగా
దరినిల్చి రామచం
ద్రా! పరమాగమాదిమునిరాజ
మహేంద్ర యటంచు మ్రొక్కెరా॥ 27

కోతిని రామచంద్ర! నినుగొల్చెడి
నిల్కడలేదు నీదు వి
ఖ్యాతచరిత్రగాంచి కొనియాడెడి
మంజులవాగ్విలాస మీ
కోతికి మచ్చుకైన కనుగొంట క
దెచ్చుట కానరాదు; సం
ప్రీతిగ మోతు మూపుపయి విశ్వముఁ
జూచెడి వేడ్కయున్నచో॥ 28

అడవులు వట్టి యే చదువులంటని
గిట్టని కోతిజాతిలో
జడుడను నేను రాఘవ! నిజమ్ముగ
నీ పదపంకజమ్ము లె
ప్పుడు తలఁదాల్చునట్టి కరముల్
గలవాఁడను; నాదు రాకతో
గడగడలాడి వేడు తరుకాండము
విచ్చిన పూలగొంతుతో॥ 29

నేఁ డిటువంటి వానరుని
నీ వెటు లెంచి దయారసమ్మునన్
జూడగ వచ్చినాఁడవో మనోహరరూప!
జగన్నియంత! నా ·
గూడలు వంగిపోయె,
తలత్రుళ్లెడి నా పొగరెల్లజారె; నో
రాడుటలేదు ప్రొన్నడె నజాండము
తావకదర్శనమ్ముతో॥ 30

ఆ రామ లక్ష్మణులు త
ద్వీరాగ్రణియైన మారుతి ప్రస్తుతివిన్
పేరిమి పెనవేసిరి వి
స్తారాశ్చర్య చకితులయి సంభ్రమమతులై॥ 31

తమ వృత్తాంతము విన్నవించుట కయోధ్యా
స్వామి యాజ్ఞాప్రభు
త్వముచే లక్ష్మణుఁ డెంచెయో ముదముగాఁ
ద ద్వానరస్వామినిన్
సుముఖత్వంబున జూచి యిట్లనియె నో
సుశ్లోకమూర్తీ! త్వదీ
య మహాత్మ్యమ్ములు మా కగోచరములై
యాశ్చర్యముం గొల్పెడిన్॥ 32

వానరపుంగవా! కనుల పండు
వొనర్చె త్వదీయ దర్శన
జ్ఞానము; రామనామ జపసౌఖ్యము
తో గహనమ్ము దివ్య సం
తానవనమ్ముఁ జేసితివి; తావక
నామముఁ జెప్పి ముందుగా
వీనులవిందు సేయుము వివేక
ధనుర్బల కార్యసాధనా॥ 33

ఓ కపిరాజసత్తమ! మహోన్నతమైన
త్వదీయ దివ్య సు
శ్లోకము మే మెఱుంగము త్రిలోక
పవిత్ర చరిత్ర మూర్తియై
యీ కమనీయగాత్రుఁడు మహీసుతతో
బితృవాక్య మేలగా
భీకర కాననంబులకు వేడుకతోఁ
జనుదెంచె వింటివా?॥ 34

ఈ పితృవాక్యపాలకుని కే
ననుజుండ త దీయ ధర్మ వి
ద్యా పరమేశ్వరాజ్ఞ తలఁదాల్తు సదా
కలలోనగూడ యే
పాపమునైన నైపని కృపారసమూర్తి
కపీంద్ర! తన్మహా
క్ష్మాపతి ధర్మపత్నిని నిశాచరు
లెత్తుకుపోయినారయా॥ 35

కోసలదేశనాయకుని కూరిమి
బిడ్డఁడు వీరలోక వి
శ్వాస మహాస్వయంవరసభా
శివబాణ విలుంఠనక్రియా

భాసుఁడు సూర్యవంశ గుణభాగ్య
విలాసుఁడు రామనామ స
చ్చాసన సార్వభౌముఁడు నిశాచర
మాయకు తెల్లఁబోయెగా॥ 36

కోదండరాముఁ డీతఁడు
వేదండ బలాఢ్యులైన వీరులనెల్లన్
కోదండముఁదీసి భలే
పూదండలు సేఁగలందు పుట్టెలనెల్లన్॥ 37

అంత ధనుర్బల ప్రముఖుఁడై
గహనాంతరసీమఁజొచ్చి ది
గ్దంతుల గుండె దద్దరిలు కష్టములోర్చి
యమాయకుండుగా
వింతను పర్ణశాల పరివేష్టితుఁడై
నిజధర్మ పత్నితో
సంతసమొంది కాలమును జక్కఁగఁ
బుచ్చెను నేను గొల్వగా॥ 38

క్ష్మజనయిత్రినోములు పసందుగ
ముందుగఁ పండఁజేసి, య
వ్యాజకృపాప్రపంచ జనకాత్మజ
చల్లని జ్ఞానమాతయై
రాజకళాప్రసన్న రఘురామ
పదాబ్జయుగమ్ము రేఁబవల్
పూజలొనర్చుతల్లిని ఖలుల్
దనుజాధము లేమిచేసిరో॥ 39

ఎవఁడో బంగరులేడియై మెఱసి
మ మ్మెంతో విచిత్రంబుగా
నవమానించఁ దలంచి జానకిని
గర్వాంధుండు గొంపోయె; దా
నవులం దింత దరిద్రు లుందురని
యేనాఁ డేము భావించలే
దు వివేకాగ్రణి! తచ్ఛురద్విషుల
గూల్తుం రామబాణమ్ముతో॥ 40

వాయువు ముజ్జగముల దీ
ర్ఘాయువుగా జేసి దిగ్జయ జటాయువ్వైదై
త్యాయువుఁ దీయంజాలక
నాయన! నా తల్లిజాడ నయముగఁ జెప్పెన్ 41

లంకాపట్టణ సార్వభౌముఁడట,
నిర్లక్ష్యస్వభావైక దు
ర్హుంకార ప్రళయాట్టహాస ఘన
మూర్ధన్యుండటా; దిక్పతుల్
పంకాలాగెడి బంటు లైరట;
ప్రతాపశ్రీదశగ్రీవుఁడై
జంకించెంగదటోయి లోకము
ధనుష్టంకార శౌర్యమ్ముచే॥ 42

భూసుత నా జడుండు కొనిపోయె
నటంచు జటాయు వేమిటో
వాసన యించుకంత పసిబట్టి
వచించెను, వానరేంద్రః వి
శ్వాసధనుండ వీవు సహవాస
మొనర్తుము; రావణుండు సిం
హాసనభ్రష్టుఁడయ్యెడి మహా
సుముహూర్తము వెటు శీఘ్రమే॥ 43

సౌమిత్రి మిత్ర నీతిని
రామాంఘ్రి సువర్ణదివ్యరాజీవముతో
ప్రేమాస్పదముగఁ గైకొని
భీమాకృతిచే ప్లవంగవీరుఁడు వలికెన్॥ 44

దాశరధీ నమోస్తు! భవ తారకనామ
నమోస్తు! ధర్మ సం
దేశ మనోజ్ఞమూర్తి! నవనీత
కృపారసచక్రవర్తి! యే
దేశమునందు మా జనని తేలినగూడ
యమాంశ మింక త
ద్దేశము మొత్తమెత్తి భవదీయ
పదమ్ములముందుఁ బెట్టమే॥ 45

శతసహస్రకోటియుగాల జన్మలెల్ల
ధారఁబోసి త్వద్దర్శనార్థమ్ము నిఁక
కలరు వానరప్రభులు నాకంటె బలులు
వారిముం దేను నలుసును పరమపురుష॥ 46

హనుమంతుండని యాంజనేయుఁడని
నా కా రెండుపేర్లుండె; నం
దన మూర్ధన్యునిగా నొనర్చిన
జగత్ప్రాణుండు నా తండ్రి, న
చ్చిన సుగ్రీవుఁడు నాకు తేఁడు వను
వాసింగన్న శ్రీ యంజనీ
మణి పాదమ్ములసాక్షి దైవ మిల
రామస్వామి వ న్నేలుఁడీ॥ 47

గీతాంజలితో మృదు సం
గీతామృత రసతరంగిణి కెరటములతో
వాతాత్మజుఁడు కొలువ సం
ప్రీతాత్ముం డైయయోధ్యతేఁడిటులనియెన్ 48

హనుమా! తావక దివ్యవర్ణనము
బ్రహ్మానందముం గొల్పె. ని
ర్జనఘోరాటవిలోన నింత కరుణార్ద్రి
స్నేహభాగ్యైక జీ
వనముం గాంచము మేము; నీపగిది
యాపద్బాంధవుం డింకలేఁ
డని బ్రహ్మాండములెల్ల త్వచ్చరితముల్
ధ్యానించు ముక్కాలముల్॥ 49

హనుమన్నా! వినుమన్న! మేరువులు
నూరైనం సరే యొక్క మి
త్రునితోఁ దూగవు. మిత్రు లింక పదినూర్లుం
నిండినంగూడ యొ
క్క నిఖార్సైన దయాబ్ధితోడఁ దులఁ
దూగంలేరు; లోకైక పా
వని! తత్ప్రేమపయోధి తూగ దిల
నాపద్బంధుతో నమ్మమీ॥ 50

చుట్టాలు బంగారు కొట్టాలలోఁగాని
చుట్టఱికము తిర్గబెట్టరయ్య
ఇల్లాండ్రు మైనిండ హేమంబిడినగాని
అనురాగ మొల్కఁబోయరుకదయ్య
అన్నదమ్ములు కల్మి యడుగకుండినగాని
తోడయి మర్యాద చూడరయ్య
బిడ్డ లాడెడి యాట దొడ్డదనినగాని
వేడ్కనన్నముఁ బిల్చి పెట్టరయ్య॥ 51

కన్నవారు సంతతిసుఖ మున్నగాని
కనులపండువై కాలమ్ము గడుపరయ్య
మిత్రునికి మిత్రుఁడైన ప్రేమింతురయ్య
ఆంజనేయ! ఆపద్బాంధవాభిధేయ॥ 51

సకలైశ్వర్యకళా విరాజితములై
సౌందర్యసౌఖ్య ప్రధా
న కథాసౌధబుధావలంబనములై
నానాపురశ్రీలు ఖ
ర్చుకు వర్ధిల్లెనుగాని మచ్చుకొక
పూజ్యుం డింక నీమాడ్కి కం
ట్లకుఁ గన్పించకపోయె మారుతి!
కృపాలావణ్యవారాన్నిధీ॥ 52

వనవాసంబులు మీకు, సుందరకళా
ప్రాకారశృంగార ది
వ్యనివాసంబులు మాకు, వానరవిభూ!
త్వద్భాగ్యయోగ్యమ్ములై
న నివాసమ్ములు కూర్చు మానవులపైనం
గౌరవంబేల ? స
జ్జనసాంగత్యము మారుతాత్మజ!
భవత్సాన్నిధ్యమం దున్నదే॥ 53

బృందావనోద్యానమందానిలాస్థాన
సౌఖ్యంబుకంటె నీ జాలి మేలు
అమృతమందాకినీభ్రమరగీతాలాప!
భాగ్యంబుకంటె నీ పలుకు మెఱుగు
త్రిభువనసౌందర్యదివ్యతేజస్వినీ
నాట్యంబుకంటె నీ నడత లెస్స
బ్రహ్మండకీర్తిదీవ్యచ్ఛౌర్యకార్య
శుభ్రజ్యోత్స్నకంటె నీ భక్తి గొప్ప॥54

శతసహస్రకోటి స్వర్గచక్రవర్తి
వజ్రవైడూర్యరత్న సంపదలకంటె
నీ మహాదర్శనమ్ము పుణ్యములసొమ్ము
అఘవినాశాయ! శ్రీప్రసన్నాంజనేయ॥ 54

ఆనందాశ్రువు లిట్లు చల్లని ఘన
శ్యాముండు రాముండు నె
మ్మే నుప్పొంగెడి వాయునందనునిపై
మిన్నంటి వర్షింపఁగా
ఏనాఁడో పడియున్న మోక్షసహితం
బెన్నో యిగుళ్లెత్తి స
న్మానించెం రఘురామమూర్తిని కళా
మాణిక్యపుష్పాలతో॥ 55

రాముండు నీలమేఘ
శ్యాముండు కృపాకటాక్షసౌందర్యకళా
ధాముండు కౌగిట మహా
ప్రేమాస్పదుఁడై కొన కపివీరుం డనియెన్॥56

మఱచితి రామచంద్ర యిఁక మైథిలిమాట,
క్షమించుడయ్య! ద
గ్గఱ కదుదెంచినారు, గుణగణ్యుఁడు
నా యెకిమీడు కోటి వా
నరభటు లున్నవాఁడు భువనంబున
మీ చెలికాఁడు కాఁగలం
దరయుఁడు స్వామియంచు హనుమ న్నటు
లైగెకొనిపోయె భక్తితో॥ 57

ఈవిధ మాంజనేయుఁడు విధేయుఁడుగా
రఘురామనామ గీ
తావిభవోజ్వలుండగుచు దాశరధిం
భజియించి భక్తితోఁ
ద్రోవను రామలక్ష్మణులతో
నరుదెంచుట లేచి చూచి సు
గ్రీవుఁడు భీతితోడ వణకెం దరువుల్
కురిపించె పుష్పముల్॥ 58

హనుమంతుం డభయమ్మొసం బరవశుండై,
బల్ ధనుర్ధారులై
వెనువెంటం బఱతెంచుచుండెడి మహా
వీరావతారమ్ములన్
గనుచుం గంతులువేయుచుం మధుర
విన్యాసమ్ముతో వచ్చు ది
క్కును సుగ్రీవుఁడు సూచి త్రుళ్లిపడి
దూకుల్ వెట్టె భీతాత్ముడై॥ 59

ఆ సుగ్రీవుఁడు కంపితాంగుఁడయి
శాఖాగ్రంబునుం చిట్లు వి
న్యాసమ్ములఁ బలుమార్లుఁజేసి భగవ
ధ్యానమ్ము ధన్యాసితోఁ
జేసాగం గపికోటి యచ్చెరువునం
జీరంగ భల్లూకరా
జాసీనుండయి మెల్లఁగాఁ బలికె
ధైర్యస్థైర్యగాంభీర్యముల్॥ 60

కపిరాజా! భయమేల? నీ బలము
ని న్గన్పెట్టు కొన్నట్టి నీ
కపిసైన్యమ్ము త్వదీయప్రాణహితులై
గర్వించుచున్నట్టి మా
విపులాఖండలశౌర్యమండలము
భావింపంగ సామాన్యమా
యిపుడే తద్బలశాలి వాలిపని
నీ వీక్షింతు వాలింపుమా॥ 61

అని యోవార్చెడి జాంబవంతుని
యసాధ్యంబైన వాక్శౌర్యగ
ర్జన సుగ్రీవుని చెంతకోతి వివి
హాస్యంబైన మా పెత్తియి

ట్లనె; మున్నొ బలశాలి వాలి మన
సైన్యాలన్నీ చెండాడి త
ర్మినవాఁ డింతటి వీరవాక్కెచట
దూరెం స్వామి వాక్రుచ్చుమీ॥ 62

ఆమాట క్రొక్కపెట్టున
నామాలకపుల్ పకపక నవ్వంగ కపి
స్వామి చిఱునవ్వు నవ్వెను
భూమీశునివెంట ముఖ్యమువిదూషకుఁడై 63

రామునితో ధనుర్బల పరాక్రమ
కేసరియైన లక్ష్మణ
స్వామినియుంచి బంటువలె వాయు
సుతుం డటు ముందుసాగి సు
త్రామునితుల్యుఁడైన కపిరాజు
సమీపముఁ జేరినామటం
బా మహితాత్ములం సుమలతాసనులం
బొనరించి యిట్లనెన్॥ 64

వీరాగ్రేసరులార! కైకొనుఁడయా
విశ్రాంతి యిచ్చోట వి
స్ఫారప్రేమసముద్రుఁడైన ప్లవగస్వామిం
భవత్పాద పూ
జారాజీవకళాద్విరేఫకవితా
సామ్రాట్టునింజేసి స్వా
మీ! రామప్రభు నీదు దర్శనము
సేయింతుం గటాక్షించుడీ॥ 65

అని రఘురామచంద్రుని దయారస
భాగ్యముతో సమీర నం
దనుఁడు మహాప్రమోదకవితా
మహితార్ణవరత్నవీచికా
ఘనుఁడయి లేచి దండమిడి గ్రక్కున
నేగెను నొక్కగంతుతో
వనచరుఁడైన వానరుని భక్తికి
లోకము లజ్జఁబొందగా॥ 66

భయవిభ్రాంతి యెదందరాపిడి మహా
బాధించి వేధించి యే
ప్రియవాక్యంబులు వీనులంబడక
సుగ్రీవుండు కూర్చుండి ని

శ్చయ మాలోచనచేయుచున్నతటి
　　నుత్సాహంబుతో వచ్చి సం
శయవిచ్ఛేదమెునర్చె మారుతి కపుల్
　　సంతోషముల్ సెందగా॥ 67

అవరుసం కపుల్ తరువు లచ్చెరువుల్
　　ప్రమదైకనాట్యముల్
తీవిగఁజేసి కొమ్మలుపెకిల్లున
　　వంచుచు పెద్ద సందడుల్
కేవలముం దుఫానువలె లేపఁగ
　　మారుతివంకఁజూచి సు
గ్రీవుఁడు వల్కె నీ వెపుడు రివ్వున
　　వచ్చితివంచు వేడ్కతో॥ 68

వచ్చినవార లెవ్వరు ? ప్రభంజనపుత్ర !
　　తదీయు లెవ్వరో
మచ్చికతోడ కంటివ ? సమస్తము
　　వింటివ ? తన్మహాత్ములే
కచ్చెకుఁ గాలుద్రవ్వి కపికాండము
　　మీదకు వచ్చుచుండిరో
అచ్చునుగ్రుద్దినట్లు స్ఫుటమై
　　పొడఁగట్టెను వారి తేజముల్॥ 69

మన ప్రాంతంబున కింత వీరధరణీ
మార్తాండు లెన్నండు వ
చ్చినటుల్ లేదు; తదీయశౌర్యవదనశ్రీ
బాహువైశాల్యమం
దనవక్షప్రభ వెల్గు వీరులను
గాంచంలేదు, వా రెవ్వరో
హనుమా! చెప్పుము చిక్కబట్టుము
మదీయప్రాణముల్ ధైర్యముల్॥ 70

వారు పరాక్రమంబున శివాలున
నీ వెనువెంట బల్ ధను
ర్ధారులునౌచు వచ్చెడివిధంబును
గాంచుచు మేము చెట్లపైఁ
జేరి మతెంతయో బెదరి చేతులు
మోడ్చి స్మరించినాము దై
త్యారిని మారుతీ యనుచు నల్ల నొకా
నొక కోతి దూకెడిన్॥ 71

భయ మేమాత్రము లేదటంచు హనుమస్వామి
ప్రమోదాత్ముఁడై
జయసంరంభముతోడ నిట్లనె
కపిస్వామీ! వినుం డింక ది

గ్జయసామ్రాట్టులు వారు కోసలధరా
సంస్థానధౌరేయులై
నయముం విస్మయచిత్తులై విధి
విధానం గాన కేతెంచిరే॥ 72

పేరులు రామలక్ష్మణులు విశ్వములో
మన కోతిమూక క
వ్వారిజనేత్రులం గనెడి భాగ్య మ
దెన్నఁడు వట్టలేదు, త
ద్వీరులు బొద్దుమీసమును పెంచి
మదించిన మేకపోతుగం
భీరులు కారు, లెమ్మి కపివీర!
కనుంగొన రమ్మి వేడ్కతో॥ 73

ఆ జగదేకవీరులు దయారస
వార్ధులు నవ్య దివ్య తే
జోజయమై భవోన్నత యశోధన
మూర్తులు వాసరప్రభూ!
రోజులు చక్కఁబడ్డవి, సిరుల్
మొలకెత్తెను, లేక తన్మహా
పూజితు లింత కోతిమొగముం
గనుగొందురటయ్య ప్రీతితో॥ 74

సందేహించకుడయ్య వానరవిభూ!
సద్ధర్మ సౌజన్య స
త్సౌందర్యాత్మలు వారివయ్య! విధి
దౌర్జన్యక్రియా క్రౌర్యమో
కందర్పోజ్వల జాడ్య మౌఢ్య దనుజ
స్కంధోద్యమంబో, మతే
సందర్భంబొ, ధరాతనూజనకటా
క్ష్మాజావి కోల్పోయెగా॥ 75

పితృవాక్యంబుల నేలగానడవికిం
బెన్వేడ్కతో వచ్చి దు
ర్మతులం గొండొకకంటఁ గన్గొనక
యీ రాజేంద్రులత్యంత ప్రే
మ తురాషాట్టులుగాఁ జెలంగి
కపి సామ్రాజ్యాధిపా! నేఁడు భూ
సుత కోసమ్ము విషాద వైతరణిలో
శుష్కించుచున్నారయా॥ 76

సరిసరి గాథ మొత్తము వసందుగ
నున్నది చెట్టుచేమలకా
బెరిగి సదా యొకేరకవు పిట్టలు
నొక్కట చేరినట్లు భూ

వరులు మహా కపీశ్వరులు బాగుగఁ
జేరి రటంచు నింక యీ
యిరువురి స్నేహ మేర్పరచుటే
శుభమౌనని రెల్ల వానరుల్॥ 77

కేవల మా మహాత్ములు సఖీజన
సౌఖ్యముఁగూర్చి మానవుల్
కైవడియున్నవారలని గాంచఁగ
రా దవతారమూర్తులై
భూవలయాన ధర్మబలముం
నిలపెట్టెడివారటంచు సు
గ్రీవుని మారుతాత్మజుఁడు ప్రీతిగ
తోడ్కొనిపోయె మెల్లగా॥ 78

మిగిలిన వానరేంద్రులు సమీర
కుమారునివెంట భక్తితో
తగిలిరి రామనామ కవితా
మహితాక్షరరమ్యకాంతులై
నిగమకథాసుధారసధునీ
కమనీయ తరంగరత్న మీ
న గణములేమొయంచు రఘునాధుఁడు
లక్ష్మణుడెంచఁ బ్రీతితో॥ 79

ఈ కపిసైన్యవాహిని మహీతల
మీనినమాడ్కి లేచి లో
కైక మనోభిరాములకు నింపు
ఘటిల్లెడిరీతి చెట్లపై
తోక లొకళ్లొకళ్లు జతతోడను
గైకొని తోరణాలుగా
ప్రాకెను రామలక్ష్మణులు పక్కన
నవ్వి నమస్కరించగా॥ 80

దరహాసంబున దమ్మునిం గని యయోధ్యా
స్వామి; సౌమిత్రి! యీ
పరమానంద మెఱుంగ మెన్నఁ డనె;
దేవత్వంబు సాధించు భూ
నరు లివ్వానరు లైకమత్యమును
సంపాదింతురా ? చూడు మ
చ్చెరువుంగొల్పిరి తోరణమ్ములయి
వాసిం వన్నెలుయ్యాలలై 81

కొండొక కోతి కొట్టుకొని గుండెలు
వానరులార! వ్యాఘ్ర వే
దండము లెన్ని యీ యడవిఁ ద్రచ్చినగూడ
రవంత భీతి లే

కుండ యధేచ్ఛగాఁ దిరిగియుంటిమి గాని,
మఱెన్నఁ డింత కో
దండధనుర్ధరుల్ మనలఁ దాకినటుల్
కనమంచు దూకెరా॥ 82

ఆవిధ మొక్క కోతి భయ మావహమై
దుముకంగ దానితో
లేవిడియైనకోతులు చలించి
మనమ్ములు నాల్గుదిక్కులన్
ద్రోవలువట్టినట్టి గతితో
ప్రతిగ్రామముఁబట్టి నేఁడు సు
గ్రీవుని వారసత్వమునకే
పడెనేమొకా కొంప కొంపపై॥ 83

కోతులు లేపినగోలకు
కోతులయెకిమీడు గూడ గుండియదడతో
జాతర కేగెడి పశువై
భీతిల్లగ వాయుసుతుఁడు వెతఁబాపె నిటుల్॥84

దేనికి కోతులార! చెవి దిబ్బలు
గట్టెడిగోల? తద్ధరా
జాని దయాపయోధి, తెఱచాటు
నటించు విరోధి కాదు; లో
కానికి శాంతిదాతయయి కాఱడవుల్
నవనందనాలుగా
తేనెలువోసి చేయ నరుదెంచిన
దేవు(డుసుమ్మి కోల్పడీ॥ 85

ఆ దివ్యసుస్నిగ్ధ పాదపద్మ యుగాలు
కాంతురే యే వజ్రకాంతినైన
ఆ జగత్కీర్తి మహార్ణవ హృదయాలు
వీక్షింతురే యెంత విలువనైన
ఆ వీరశౌర్య విశాలభావ బాహుబలాలు
తిలకింతురే యెన్ని తలలనైన
ఆ భువనైకమోహన రాజతేజాలు
పరికింతురే వేల్పు దొరలనైన
ఆ మధుర మధుర వచో కథామృత రస
భాగ్య విన్యాసములు మఱే బాసనైన
జూతురే కుప్పిగంతుల కోతులార
విశ్వకళ్యాణమూర్తుల వీరపతులు॥ 86

ఈ గంబ్ర శిలలేడ్చి యేడ్చి రామకథా ర
సతరంగిణీక్షీరజలధులైన
ఈ మోడు మోడేడ్చి కోమలంబుగ రామ
నామపల్లవ పుష్పధామమైన
ఈ పక్షిసంతానమేడ్చి రామామృత
గాన సోపాన సంస్థానమైన
ఈ భీకరాటవి శోభించి రామ రా
జ్యమహోత్సవపు పందిరైనగూడ
శతసహస్రవిధాల మీ సరస నేఁడు
గడన కేమాత్రముఁదగని జడుడ నేను
రామనామముతీపి మఱగినగూడ
కుప్పిగంతులేటికి మీకు కోతులార॥ 87

వెఱవకుఁడంచు భక్తి కురిపించుఁ
డటంచు మహావిధేయులై
శిరములు వంచి సంస్తుతులు సేయుఁ డ
టంచు వచించి వెంట వా
నరపతి నింక గైకొని వినమ్రతగా
హనుమంతుఁ డెన్నియో
విరచిత పుష్పహారములు వేసెను
కోసలరాజ కోటికిన్॥ 88

కాలాతీతము చేసితిం రఘువరా!
కారుణ్య ధారాధరా!
నా లోపాలు క్షమించుడయ్య!
కపిసంఘాలన్నియుం గూడగా
నాలస్యంబయిపోయె దాశరధి!
యీ యధ్వాన్నలోకాన నే
లీలం గోతుల కెక్కవేమి త్వరగా
లేఁమాలివైనం నుడుల్॥ 89

ఇవిగో! స్వామి! పరిగ్రహించుఁడు
ఫలా లివ్వానిలోఁ దీపివై
నవి పన్నీటిరసాలు; కాఱడవిలోనం
దక్క వెచ్చోట ని
య్యవి; నీ దర్శనభాగ్యహేతువున
ఘోరారణ్యవృక్షాలు మేల్
పువులం భక్తిరసాలసాలములు
కాఁబోలయ్యె రామప్రభూ॥ 90

నిలుకడలేని కోతులకు నీవు
మహాత్మ్యఁడవంచు బొత్తిగా
తెలియదు రామచంద్ర! భవదీయ
కృపారసవృష్టిచేత వి

ర్మలముగ నిశ్చలమ్ముగ సమత్వముగా
కపిజాతి మార్చి కో
మలమును జేసికావుము సమస్త
జగమ్ములు పల్లవించగా॥ 91

హనుమన్నా! పండ్లను మీ
రును తినుఁ డన్నా యటంచు ప్రోత్సాహముగా
ఇనవంశరాజచంద్రుం
డనగా వీరాంజనేయుఁ డణకువ ననియెన్॥ 92

ఇదిగో! రామవిభూ! మదీయులకు
నేఁడీ పండ్లకంటే, త్వదీ
య దయార్ద్రైకరసానుభూతి మధురంబై
యున్న నీ కండ్ల సం
పద మా కెక్కువప్రీతి, యా చలువతో
బ్రహ్మాండముల్ పల్లవిం
చి దరిద్రంబు లుపద్రవంబులు సహా
నిర్మూలమౌ శీఘ్రమే॥ 93

దేవ! మహానుభావ! భవదీయ
పదాబ్జము లీ యరణ్యపుం
ద్రోవల నెంత నొచ్చినవొ; దుస్తరమై
పద మానసీని ఘో
రావని ముండ్లు గ్రుచ్చుకొని యబ్బ!
మఱెంత దురంత బాధలన్
నీవు సహించినావొ దొర! నీ పద
పద్మము లేవి చూడనీ॥ 94

అడుగుల్ బొబ్బలు పొక్కెనేమొ
పయనంబై నావు నాగోల కి
ప్పుడు; నీ కేమి యొసంగి తృప్తిపఱతుం?
ముందింక యీ మొద్దుఁబా
రెడు చర్మం బొలిపించి జోడు కడు
కూర్మిం నీవు కుట్టించుకో
పడియుందుం నిరతంబు నీ చరణ
సేవాదీక్షతో రక్షకా॥ 95

ఈ బంగారు పదాబ్జముల్ కొఱకు
మున్నెన్నో మహాజన్మ లెం
దో బోల్తాలనుగొట్టిపోయినవి;
యెంతో పూర్వపుణ్యైక ల

క్ష్మి బాంధవ్యవిశేషముండి మనకుం
శ్రీరామ పాదాబ్జముల్
బాబూ! దక్కెను కోతులార! తలఁదాల్పం
రండు ధన్యాత్ములై॥ 96

అకటా! యీ త్రిజగన్మనోహరుల కే
యద్దాల సౌధాలలో
సుకుమారత్వము లెల్ల చెల్లఁబడెనో
సుస్నిగ్ధగాత్రంబు లెం
డకు బెండైనవి; యెప్పు డోగిరము
వేడ్కం ముట్టిరో యేమొ కం
టికిఁ గున్కన్నది లేక భూతనయకై
నిర్నిద్రులైనారయా॥ 97

స్వామీ! యీతఁడు వానరేంద్రుఁడు మహా
శౌర్యార్ణవోత్సాహ సు
త్రాముం డీతఁడు మీకు ప్రాణహితుఁ
డీతం డింక; సచ్ఛీలుఁడై
క్షేమం బెల్లద కోరి పేర్వడసె
సుగ్రీవుండుగా నీతఁ డ
య్యా! మీ కార్యముఁ జక్కఁబెట్టు
ననివార్యస్థైర్యగంభీరుఁడై॥ 98

హనుమంతుం డిటు లెంతయో పరమ
భక్తాగ్రేసరుం డౌచుఁ బ్రా
ర్థనగావించి, మహోపచారము
లపారంబైన సంతోషవా
ర్ధి నిమగ్నుండయి యాచరించి
కరుణార్ద్రీభూతచేతస్కుఁడై
చినుకుల్ రాల్చి కపిప్రభుం దెలిపి
కొల్చెం గోసలాధ్యక్షులన్॥ 99

వాయుసుతుండు పాదములపైఁబడి
నంతనె కోతులెల్ల పూ
ల్దోయిలితో ప్రణామములతో
ప్రణమిల్లి విధేయులై నుతుల్
నేయగ రామలక్ష్మణులు చేరఁగఁ
దీసి సమస్త దివ్య దీ
ర్ఘాయువు లిచ్చి యభయంబిడి
రందఱి కింక ప్రీతితో॥ 100

అపు డెపుడో ప్రభూ! దొరికినట్టి
సువర్ణ విభూషణంబు లీ
నృపులకుఁ జూపుఁ డయ్యవి మహీసుతవో
మఱి యేరివైనవో

విపులము సేతురం చొక కపిప్రము
ఖుం డనగా నె వీర శౌ
ర్య పవనపుత్రుఁ డౌనని రయంబున
దెచ్చెను నొక్క గంతులో॥ 101

రామా ! యీ తొడవుల్ కనుంగొనుడు
మా రాజ్యంబులో నింత ల
క్ష్మీమాణిక్యసువర్ణభూషణము
లీక్షింపంగ లే దేము ; స్వా
మీ ! మా తల్లివి యేమొ చూడుఁ డని
తన్మేధావి యందిచ్చె ; శ్రీ
రాముం డయ్యవి చూచి పొంగిన
సముద్రా లెన్నియో క్రింగెరా॥ 102

నివ్వెరవోయి లక్ష్మణుఁడు, నిష్ఫకలై
నయనాలు, వ్రాచుగాఁ.
చివ్వున లేచి విల్లు పరిశీలన
చేయుచు కోతులార! మి
మ్మెవ్వఁడు కాచుకొన్న వధియింతును
జెప్పుడు నిక్కమంచుఁ బై
రివ్వన దూకబోయెడితటిం తరువుల్
పయి కెక్కె వానరుల్॥ 103

ఏమిటి లక్షణా! నిలువు మెవ్వరిపైఁ
బడుచుంటివంచు శ్రీ
రాముఁడు తెక్కఁబట్టుకొని రమ్మని
తమ్మునిక్రోధ మాపి; సం
గ్రామములోన జూపవలె శాత్రవుఁగాని
యిదేమి టయ్యయో
నీ మతిపోయెనా యని వినిర్మలచిత్తుని
జేసె ప్రేమతో॥ 104

రామ ధరాతలేంద్ర! యెవరాపిడి
శంకలు రేపి లక్ష్మణ
స్వామి మహాగ్రహంబున భుజంగముగాఁ
బయి లేచుటెల్ల త
ప్పేమియుగాదు న్యాయ మివియెల్ల
విమానమునుండి యెవ్వరో
యీ మహిపైన వైచిరి సుమీ
యని మారుతి చెప్పె నమ్రుఁడై॥ 105

ఈ సుగ్రీవుఁడునైత మిక్కుపులతో
నిమ్మాడ్కి భీతిల్లుచల్
దోసాలేమి యొనర్చి కాదు, తమ
మూర్తుల్ సూచి రామప్రభూ

ఆ సంగ్రామమదోగ్రవారణ మహా
హర్యక్షమౌ వాలి యే
మో సూడుండని సిల్వసీని భయ
మిట్లూగించెఁ గాపాడుమీ॥ 106

ఈ వసుధాతలంబునకు నింత
ప్లవంగ బిడౌజుఁడైన సు
గ్రీవ సునామధేయుడు సుఖించెడి
రాజ్యము వాలి లాగి బల్
చేవనుబట్టి త్రోసెను బలీయముగా
నగచాట్ల కానలో
కావు మటన్న మారుతి నుతిం వినె
రాముడు జాలిగుండెతో॥ 107

హనుమా! నీవు నిజమ్ముగా శివుఁడవయ్యా!
యిందు సందేహ మే
యణుమాత్రంబును లేదు నమ్మితిమి;
నీ యాజ్ఞాప్రభుత్వమ్ము మే
మనయంబుం దలఁదాల్చుచుందుముఁ
త్వదీయ ప్రేమ సామ్రాజ్య శౌ
ర్యనిధుల్ కోతులు కాంచకుండినవి
ఘోరారణ్య దేశాలలో॥ 108

ఆగమమూర్తివై ఘనదయారస
జీవన చక్రవర్తివై
మా గౌడపల్ గ్రహించి తగుమార్గముఁ
జూపితి కానలందు, నీ
వే గతి మారుతీ! బ్రతుకు లెన్ని
సముద్రము లీదుచున్న మా
ర్మోర్మిగు నెదంచలోకవనముల్
నినుగొల్చెడి భక్తిగీతముల్॥ 109

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# కృతిపతి సంశము

మా కృష్ణాజిల్లాలో
శ్రీ కళలకు మానికొండ చెన్నారెడ్డిదై
మైకా పరమేశుని గని
భూకైలాసముగ వెల్గఁ బొగడఁగ సుకవుల్॥

నవరసు మూసలోఁ గరఁగి నాణ్యముగా
నగయైనగూడ దా
ని విలువ దాని తళ్కు మణినిం బొదిగించిన
గాని రానియ
ట్లు విజయవాడ పట్టణములో నటియించెడి
యే మహాసభా
కువలయనేత్రయైన మణికొండగ వెల్గును
మానికొండతో॥ 2

ఘన విద్యావనభాగ్యవంతులయి
సౌఖ్యశ్రీ చిరంజీవులై
తెనుఁగుల్ పెద్దవెలుంగు వెల్గఁగలరీతిం
రత్న మాణిక్య స
స్యనటీజీవన కర్షకోత్తములుగా
సంతృప్తులై కమ్మక
మ్మని వారయ్యెడి కమ్మవారచట
ధర్మస్వాములైనారయా॥ 3

ఆహూయమాన మంపిన
మోహనకృష్ణుని కృపాసముజ్వల మురళీ
వాహిని వేంకటరమణుని
స్నేహైశ్వర్యఖని జూపెఁ జిగిరించ సిరుల్॥ 4

ఆ ముదిలి వేంకటేశుని
ధామంబున నాదు పూర్వతపములు పండన్
మామకౌ హూసేను పీరా
స్వామి ప్రసన్నులయి నన్ను చల్లఁగఁ జూచెన్॥ 5

మూడు భువనమ్ము లవలీల మూపుపైన
మోసికొని సప్తసాగరమ్ములను దాటు
వీరహనుమంతుఁడు హూసేను పీరస్వామి
జీవియస్నాయుని యశస్సుఁ జెవిని వేసె॥ 6

నచ్చెడి యిట్టి జీవియసునాయుని పచ్చని
వంశవృక్ష మిం
కిచ్చట నక్షయంబుగ మహీ మహిళా
మహిమాభిరామయై
హెచ్చెడిరీతివేసి సుమియించి ఫలించు
విధమ్ము వ్రాసి వా
క్రుచ్చెద మానికొండ మణికొండగవెల్గ
జగద్ధితంబుగా॥ 7

యుగయుగమ్ములనుండి యీ యుర్వినెల్ల
వేయిపడగలశేషుఁడు మోయునట్లు
గోగినేనివంశ విశాలకుంభిని బహు
రోషముగ మోసినయతండు శేషుఁడు సుమి॥ 8

ప్రపితామహుఁడై దివ్యా
త్మపటిష్ఠుండై సమస్తధర్మ ధరాస్థా
నపు గోగినేని సద్వం
శపురీ శేషార్యుఁ డేలె జయదుందుభితో॥ 9

అంతటి గోగినేని మహితాత్ముఁడు శేషయ
చౌదరీంద్రుఁ డే
చింత లెఱుంగనట్టి తన జీవితనౌకను
నెట్టునప్పు డి
గ్భ్రాంతి పడంగఁ జొచ్చి ముదివగ్గు విధాతృఁడు
కన్నుకుట్టి తా
సంతతి నీయకున్నను పసందుగ సూర్యవి
దత్తుఁ గైకొనెన్॥ 10

రంధిగ గోగినేని కులరాజ పురంబున కింక
నీ జగ
ద్బాంధవుఁడైన సూరయప్రతాపనరేంద్రుఁడు
దత్తు వచ్చి జా
త్యంధులకైన తాను శపథంబుగఁ జూపును
నిత్తునంచు మే
ల్బంధిలఁజేయు జాతకములం మణిసంతతి
విచ్చె హెచ్చుగా॥ 11

సూరయ చౌదరీంద్రుఁడు యశోధనుఁడై
కనినట్టి పుత్రబృం
దారకచంద్రు లైదుగురు నచ్చెడి చక్కని
పంచపాండవుల్
కీరితి శౌర్యకార్యమురశీరసవాహిని
కెత్తి ధాత్రి పొం
గారెడి కోటి స్వర్గము లిఁకం మొలిపించిరి
మానికొండపై॥ 12

అచ్చుల్వడ్డ సువర్ణభిత్తికలపై నవ్వారి
సత్కీర్తి మే
ల్గచ్చుల్వేసిన గోగినేని గృహభాగ్యం
బం దమోఘంబుగా

పిచ్చయ్యాఖ్యుఁడు జ్యేష్ఠపుత్రుఁడయి
పృధ్వీమండలాధ్యక్షుఁడై
హెచ్చులోవి యజాతశత్రువయి
ము న్నేలెం ధరిత్రీమణిన్॥ 13

శమ్మని కమ్మవంశ ఘన కల్పమహీరుహ
సత్కళాప్రసూ
న మ్మెగఁజిమ్మ మేలి నవనాగరికైక
యశోవిశేషభా
గ్యమ్మగ గోగినేని బలగమ్మ జనించి
జయించు నాంధ్రఖం
డమ్మున పిచ్చధర్మము లొనర్చినవాఁ డొక
పిచ్చయాఖ్యుఁడే॥ 14

వరలుచు పిచ్చయాఖ్యని తపస్సు యశస్సు
జగాన పండి ము
వ్వురు వరహాలతంద్రులు త్రిమూర్తులుగా
నుదయించి రింటిలో
హరిహరబ్రహ్మ లెంత బసవాంబిక నోముల
తోట పూయఁజే
సిరా : సిరులెల్ల పొర్లి మడిఁ జేసె ధరిత్రి
నదృష్టరాశికై॥ 15

దయకు ముత్తాత పెద్ద వస్త్రాదువోలె
జ్యేష్ఠపుత్రుఁడై శేషుఁడయ్యెను, ద్వితీయుఁ
డై యలరె సత్యనారాయణాఖ్యుఁ డద్వి
తీయుఁడై కనిష్ఠుఁడు సుబ్బనాయఁడుండె॥ 16

ఒకరిమతి నొచ్చనీయని యొడు నెక్క
మూడువంతు లార్జన వాదవాద ప్రజకు
పిలిచి యిచ్చిన పిచ్చయ్య పిచ్చియేమొ
కాదు, వానిచేతి కెముక లే దదేమొ॥ 17

పిల్లజెల్లలేని పెద్ద ధనికులకు
బాధ యెంత యెడఁద బాదుకొనునొ
నాఁడు తెలిసి సత్యనారాయణుని వట్టి
పిచ్చ నిచ్చె దత్తు పిచ్చయదొర॥ 18

ఇయ్యనఘుండు గొప్ప భువనైక యశోధన
మండనుండుగా
వెయ్యివిధాల వెల్గు చిల వేంకటసుబ్బయ
నాయుఁడయ్యతో
తియ్యని దివ్యభవ్య శుభదిగ్గజరాజ
ధురీణుఁడైన శే
షయ్యసునామధేయుని రసాతలగేయునితో
సుఖించెగా॥ 19

జ్యేష్ఠుఁడైన శేషయ్య ప్రతిష్ఠ సృష్టి
కెంతయో పుష్టి పట్టించనెంచి మున్ను
సృష్టికర్తయయిన పరమేష్ఠి మెచ్చి
వేంకటేశుని కోటీశుబిడ్డ నిచ్చె॥ 20

షోడశకళాప్రపూర్ణయశోమరీచి
యైన చక్కచక్కని గోగినేని చంద్ర
మాంబ శేషయాఖ్యుని వజ్రహర్మ్యమణిగ
వెంకటేశునిఁ గనెను గర్వించ మేము.... 21

నాయుడుగారి పుత్రరత్నాలలో ఈ చిన్నారి తండ్రినే చిన్నబాబు అని పిలుస్తారు.

ఇతఁడే కోటి యదృష్టరేఖలకు
స్థాయీభావమైనట్టి మేల్
సుతుఁడై వర్థిలు వెంకటేశ్వరుఁడు ;
కల్మిల్ తల్లి చంద్రాంబ పెన్
వ్రతముల్ పండెడి చక్కచక్కని
కళావజ్రాల బిడ్డండు ; వం
ద తరాలైనను ఆంధ్రదేశమున
చిన్నబాబుగాఁ గుర్కొడిన్.... 22

శేషయాఖ్యుఁ డిలను కీర్తిశేషుఁడయిన ;
కన్న వజ్రాలకొడుకునుఁ గాంచి మేము
వెండి కఱగిన వెన్నెల వీధిలోన
వెంకటేశునిఁ జూచి జీవింతు నెపుడు.... 23

పెక్కు విధముల తనతండ్రి పేరువాసి
దిక్కుల కెగఁబోనెడి కవివాక్కు లెల్ల,
నెపుడు నమ్మదేమో వెంకటేశ్వరుండు
అపుడు తా మూడునెలల వాఁడైన కతన.... 24

మొనగాఁ డన్నిట గోగినేని
కలశాంభోరాశి పొంగించు నం
దనమూర్ధన్యుఁడు వెంకటేశ్వరుఁడు
చిన్నబ్బాయిగా నుండినన్
తన బంగారు సరోజినీ మధుర
కాంతారత్న లావణ్యమం
దనుఁడై సంతతిఁగాంచె నైదుగురినిం
నవోదయానందుఁడై .... 25

సుబ్బయ్యాఖ్యుఁడు పిల్చు కూరుముల
కచ్చుల్వద్ద నేఁ డిట్టి చి
న్నబ్బాయిం మురిపించు బిడ్డ లిఁక
చిన్నబ్బాయిగా పిల్తురో !

ఆ బ్బాబుం తమ బాబుగా పిలుతురో ।
ఆశ్చర్య మీపట్టులో ;
అబ్బో ! యేమని వెంకటేశ్వరుని
భాగ్యం బేను వర్ణింతురా । 26

చిన్నబ్బాయిగ నీవు నీ సహజ
సుస్నిగ్ధస్వానైక సం
పన్నాఖండల మానసాబ్జ శుభ
దివ్యద్రూపరేఖాళితో
కన్నుల్పండువు సేయుచుంటివి;
కళాగంగాతరంగాంశువుల్
మిన్నంటించితి వెంకటేశ్వర !
మహామేధా కురంగేశ్వరా! 27

నీలో నింత మహాద్భుతం బయిన
పాండిత్యమ్ము, రాసిక్య మే
లాలిత్యమ్మన విశ్వశిల్ప కవితా
లావణ్యమై, మాధురీ
జాలంబై శుభసుందరం బయినదో !
సత్యమ్ముగా నేఁడు నీ
లీలం 'షామహా'లెంత చిత్రముగఁ
గుల్కెం వెంకటేశాభిధా । 28

'షా'మహల్లైన మేలిమిరసాతల
సుందరి నీ యెడందలో
కోమలరూపురేఖలు చిగుళ్ళను౯
బెట్టుటజేసి మా కళా
రామవసంతశిల్పకవిరాజగు
సత్యము అద్వితీయ మే
ధామహిమంబు కర్గి వనతన్వీగ
పోసెను వేంకటేశ్వరా! 29

చిగురాకురేకుపై నగిషీపనులు నీ
పయిడిమేడ కెల్లెత్తి తొడిగినారా!
వజ్రసరస్సు రవ్వల రాజహంసల
హాయకెట్లు నీ మిద్దె కొంచినారా!
నందనోద్యాన సౌందర్య రాశినేక
త్వచీయ శాలల కెట్లు దించినారా!
క్షీరసాగరనూపు కెరటాలయుయ్యాల
నీ సౌధమున కెట్లు వేసినారా!
నీ హృదయగోళమందు ముందే మతిన్ని
లలితశిల్పకళామండలములు కలిగి
సలిపిరేమొ! యింకెమ్మెయి సాధ్యపడవు:
సత్యమున వెంకటేశ! సాక్షాత్కరించె.... 30

గిజిగాఁడా మా చెలికాఁడా
నిజముగ నీ సగిషీపనితో
రజనీమణి రసమాధురితో
తుమ్మచెట్టుకు - నిమ్మచెట్టుకు
కట్టిన గూడూ - గట్టిగ నేఁడూ
జగరాజులను - జగచ్ఛిల్పులను
నిలిపించినదోయ్ బులిపించినదోయ్ ॥గిజి॥
చిట్టిముక్కుతో - చెక్కు చెఱగని
గడ్డిపోచతో - కట్టిన గూఁడును
గాలివానలకు - కూలనట్టుల
మేదినిపై నిలపెట్టిన మేధావంతుఁడవోయ్ ॥గిజి॥3।

నీ మేదం గని నేఁడు మైమరచుఁ
గానీ యెంతవాఁడైన; బా
బో : మా పాదము లందు మోపుట
కదేమో జంకుగాముందు : స్వా
మీ : మీ పాదము సౌకుమార్య శుభ
లక్ష్మం గుల్కెడిన్ ; మా పదం
బా ముద్దిచ్చుట కర్హతల్ వలయుఁ
గాదా వెంకటేశాభిధా : 32

ములిపిన లెక్కలేని వసతుల్
కనిపించెడి పెద్ద పట్టణం
బుల బహు కట్టడంబులు ప్రభుల్
మఱి కట్టుట లెక్కగాదు ; దా
రులు కడగండ్ల కాపురపుఁ గోతకు
తీయని పల్లెటూళ్ల మీ
వలె నెలకొల్పుటే భువనభాగ్య
విశేషము వెంకటేశ్వరా ! 33

చిఱునవ్వు కిరణాలు విఱజిమ్ము మెఱుగులో
పొరలాడినట్టి యప్సరస యేమొ !
చిగురుమామిడిఁగున్న చిట్టికోయలపాట
పోతఁబోసిన ముద్దుమూట యేమొ !
నీలిమొయిలు పట్టు మేలి ముసుగురాణి
పొదిగిన బంగారు మొలక యేమొ !
ఈశ్వరశక్తి మోహించి మంత్రించెడి
గిజిగాని కెంపుల గిన్నె యేమొ !
షాజహాన్ నోటి ముంటాజి మోజుమాట
సత్యమై యిట మొలిచిన ముత్య మేమొ !
ఇంత మహలు చిన్నబ్బాయి ! యే మహా మ
హలును పల్లెటూరున నెలకొలుపలేరు.... 34

బాబా సాహెబునుంచి 'షా' మయిను
మీ స్వాధీనమై యిట్లు మా
వా వాభాగ్యముకంటె కోటిమడుగుల్
బంగారు పాతర్లు, శ్రీ
ల్పాచార్యుల్ లభియించి 'షా' మహాలు
వహ్వా! తాజ్మహాల్వోలె స్వా
మీ! చిత్రించితి జీవియస్ విభుని
కూర్మిం వెంకటేశప్రభూ! 35

వాసిగ భూజనుల్ తమ కృపారస
వాహిని తీర్థమాడి 'మై
కాసవు', 'షామహల్' కని యఖండ
ముదంబున పొంగుచుండ పే
ర్వాసిగ పెద్ద సత్రము తిరంబుగఁ
గట్టిరి మానికొండపై
మీ సిరి పొంగి పొర్లును సుమీ
చిరకాలము వెంకటేశ్వరా! 36

బారులు తీరి పేర్లు బెజవాడకు
కాసులపేర్లుగా నలం
కారము పల్లవించు సమకాలికు
లందఱిమధ్య నీవు నీ
కీరితి లేతపచ్చ కులికించెడి
ధళ్ధళజేసి నేఁడు బం
గారపు దుర్గకొండపయిఁ గ్రాలెడి
చంద్రమః వెంకటేశుతో.... 37

ఏ వెలకట్టలేని పువులిచ్చి
గడించితివో సరోజినీ
దేవి : త్వదీయభాగ్య శుభ దివ్య
కళావనమందు మాధురీ
భావ వసంతుఁడై, కుసుమపల్లవ
మోహనుఁడై ముదమ్ముగా
తావక వెంకటేశ్వరుఁడు దైవముగా
విడె నీకు మేల్సిరుల్.... 38

రేయిఁబవళ్ళు క్రొంబసిఁడి రేకులపై
తనకీర్తి జీవియన్
నాయఁడు ధళ్ధళా చెఱుగుచాడ్పున
సాహసలక్ష్మి దాసియై

వేయివిధాల కొల్వఁబడు వెంకట
రావుమతల్లి గాంచె శ్రీ
ఛాయను వెంకటేశ్వరుని, చక్కని
శేషుని, మోహనాఖ్యునిన్॥ 39

ఈ యెనలేని కీర్తి దిశకెక్కెడి
చక్కదనాల జీవియన్
నాయుని జ్యేష్ఠపుత్రుఁడు విశాల
సుఖైక కుశాగ్రబుద్ధిధౌ
రేయుఁడు వెంకటేశ్వరుఁడు ప్రేముడితో
ఘన దివ్యమంగళ
చ్ఛాయగ ఆదిలక్ష్మిఁ దన సాధ్విగఁ
గైకొనె నెంత ధన్యుఁడో! 40

పెద్దబ్బాయిగ నీవు నీ సహజ
గంభీరస్వభావమ్ముచే
త్వ ద్దివ్యామృత హృత్సరోవర
కళావైడూర్య మాణిక్యముల్
ముద్దుల్ మూటలుఁ గట్టునట్లు
సుజనామోదమ్ముగాఁ బల్కు ము
ప్పొద్దుల్ వ్రేతువు వెంకటేశ్వర!
యశంబుల్ రాశి తూర్పారతో.... 41

అబ్బో! చక్కని చక్కచక్కని
ధరావ్యామోహినీవాణి పె
ద్దబ్బాయీ! భవదీయ దివ్య ఘన
భాగ్యప్రేమ సౌందర్యముల్
కబ్బంబుల్వలె తొల్కరించి మురళీ
గాంధర్వ బృందావనాల్
రెబ్బల్ తొడ్గును వెంకటేశ్వర!
జయశ్రీపై భవత్ప్రేరణన్.... 42

నీయతి వైభవోజ్వల వినిర్మల
కోమలమాధురీముఖ
చ్ఛాయలు, నీ యమూల్య ఘన జాతక
చాతక వజ్ర కౌముదీ
తోయధి శౌర్యనాట్య జయదుందుభు
లచ్చగనేఁడు జీవియన్
నాయుని నచ్చువోసినవి నాయన!
నీకడ వెంకటేశ్వరా! 43

కడు సుకుమార మొల్కెడి ముఖస్థితి
తండ్రిని మించినట్టి పు
త్రుఁడని తలంపఁజేయును; సిరుల్
నవరత్నగిరుల్ విధాన నీ

యడుగులు మోపుచోట విజయంబుగ
కన్పడుఁగన్క నీదు లే
యెడఁదను వెంకటేశ్వర ! మఱిన్ని
యదృష్టము లెట్లు పట్టెనో! 44

మా కారుణ్య సుధాపయోధి విభుఁడై
మా జీవియస్ నాయఁ డే
రాకానాధుని వెండిముద్ద బహు
శౌర్యశ్రీలతో కర్గి నీ
లోకైకప్రభుచక్ర భాగ్యమణి
తళ్కుల్వోసి నిర్మించెనో
'మైకాసా' నిల వెంకటేశ! గయికొమ్మా
జ్యేష్ట శ్రేష్టత్వముల్ ॥ 45

విదులెల్లం కొనియాడు భాగ్యములతో
బృందావనం బూడి ప
ద్దది కాఁబోలనిపించుకొన్న పువుచెట్లం
ఫళ్ ఫళా కుల్కుచు
న్నది 'మైకాసవు' సౌధరాజమిఁక:
మా నాయందు కోట్లైన్నియో
కుదియించం కుదురైనదై దిశలకెక్కుం
వెంకటేశప్రభూ! 46

'మైకాసా' మహాలందు దిగ్గజము
లే మంత్రోపదేశాననో
శ్రీ కాంతామణి మాలతో కొలువ
వచ్చెం; మానికొండేమి నో
మే కాలంబున నెట్టి పుట్టువున
తండ్రీ! చేసెనోగాని, భూ
లోకమ్మెలెడి కల్మలన్నినిటఁ
దేల్చెం వెంకటేశప్రభూ! 47

పన్నీటి ముత్యాలు మిన్నేటి ముత్యాలు
నీ మేడకు పొదిగించెనో మతేమొ!
ఊర్వశి చిగిరించు నొయ్యార మొలికించి
నీ మిద్దె గోడపై పామిరేమొ!
గంధర్వనగరి చెక్కని చుక్కలలో నవ్వ
నీ సౌధము పయిన పోసిరేమొ!
మయుని యులికడుపు స్వయముగా కుదియించి
నీయింట నగిషీలు నింపిరేమొ!
ఇంత సర్వాంగ సౌందర్యకాంతి, శాంతి
శుభ మనోహరమై, సద్యశోవిశాల
మైన నీ 'మయికానవు' మానికొండ
బింకమున వజ్రకవచమౌ వెంకటేశ! 48

జబ్బలుకొట్టి, మీసములు సాహసులై
మెలిపెట్టి గొప్ప పే
రబ్బెడి మాడ్కి నాల్గుదెసలం
దెగఁజోసి యశోధనంబు, నేఁ
డబ్బురమైన గన్నవరమందు
మఱెందరు పెద్దలుండినన్
క్లబ్బునుపెట్టు భాగ్యమిదె నాయఁడు
మీ కిల వెంకటేశ్వరా! 49

బాధ్యత లెన్నియున్నను రవంత
చలించని మీరు కారు సా
రధ్యము సేయుచో త్రుటి ధరా
వలయ మ్మవలీలఁ జుట్టి యా
రాధ్యుఁడెవండో చూడగ సరాసరిగా
బెజవాడ దుర్గ సా
న్నిధ్యము సేరవచ్చు స్తవనీయ
మహేశ్వర! వెంకటేశ్వరా! 50

మురిసెడి యనంత భావాం
బరవీధి విహంగ వీర వజ్రవిహారం
బరుదై, విరుదై నట్లుగ
నరశౌర్య విమాన మింక నడుపుదురు దొరా! 51

జీవియస్నాయు నెద చిరంజీవులగుచు
మీ విమానకౌశలమున మీరు విశ్వ
భారతీ కరణోద్యమ వీరులగుచు
విజయులై వీరభేరి విన్పింతురయ్య.... 52

ధీమంతుల్ కొనియాడుచుండెడి
జగత్కీర్తి ప్రభూతమ్ముగా
'గామా' వంశజులెట్లు భీమబల
విఖ్యాతిం ప్రకాశించిరో
శ్రీమంతుండగు జీవియస్ విభుని
లక్ష్మీవంశమాణిక్య క
న్యా మంజీర ఘలంఘలంరవము
లట్లాకాంక్షలై గ్రాలవే.... 53

గామాతో చెయికల్పువాఁ డసలు
తద్గామా, హమీదాలతోఁ
దా మున్ముందుగఁ జేయి కల్పనిదె
గోదాలో దిగంగూడన
ట్లే మాన్యుండయినం సరే యశము
నం దీ జీవియస్ నాయునిం
ధీమాతో నెదిరించ తత్సుతుల
ముందే గెల్వగా రావలెన్.... 54

చోద్యము నెవ్వనిం గదపిచూచినఁ
గూడ నదేమి శౌర్యమో!
విద్యలు గోగినేని యిలువేలుపు
లుగ్గున నెన్ని పెట్టిరో
సద్యశమం దెవండు నేఁక చాలని
సాహస చక్రవర్తులై
హృద్యముగాఁ గనంబడిరి యీ
చిగురాకుల జీవియస్సుతుల్.... 55

వివరముతో నదృష్టవతి వెంకట
రావుమతల్లి కండ్లపం
డువులుగ నోచినట్టి తొలినోముల
తోట చిగిర్చి పూచి మే
రువయిన జీవియస్దొర సిరుల్
మెఱుగుల్ దిశకెక్కఁజేయు పు
త్రవరదుఁడైన శేషగిరిరావు
చదావు కదాని తక్కురా.... 56

పసిఁడి గులాబిరేకులకు వజ్రములం
    పొదిగించినట్లు స
ద్రసికులుగా సమస్త కవిరాజ
    కళాభువనాలకెల్ల మీ
రసలు చిగిర్చినారు, వరహాల
    గుణాలు తలిర్చినారు; వ
ర్చసులనుఁబట్టి శేషగిరిరావః
    త్వదీయగుణాలు తట్టెడిన్.... 57

ఇటు రోల్స్‌రాయసుకారుమీదను
    షికారీ వెంతయో జోరుగా
నెటు సాగించినఁగూడ లోకము
    నవాబే మోయటం చూహచే
నటు నిశ్చేష్టతనుండు; జీవియను
    నాయం డింక నీ దైత్రివుతో
పటుహర్షుండగుఁగాదె శేషగిరిరావా.
    నీ వసాధ్యుండవే.... 58

అదియేకాదు; మఱెట్టి కారయిన
    నే యధ్వాన్న మార్గాన నై
న డిరాసాగ మహావిలాసముగ
    . పిన్నల్ పెద్దలుం మెచ్చ నీ

వది నద్వింతువుగాదె శేషగిరిరావా!
నీకు సాఖ్యమ్ముగా
నిది లే దింకను; జీవియన్ ప్రభువు
తండ్రీ: యెంత పుణ్యాత్ముడో! 59

ఆ హిమశైలవైభవ మహా
మహిమోన్నత సార్వభౌమ స
న్నాహములున్న జీవియసునాయుని
ముద్దులమూటవోలె మా
మోహనమూర్తి చక్కదనముల్
మృదుమాధురి పల్కు తేనియల్
మోహముc గొల్పుచున్నవి ప్రభుల్,
విబుధుల్, సుకవుల్ సుమించగా.... 60

చిన్నివరాల మేలినగిషీ
జలతారు శిరీషమోహనా!
ఎన్ని నుడుల్ మణుల్ పగిది యిమ్మెయి
నీ చిఱుబొజ్జలోన ప్ర
చ్ఛన్నవిధమ్ము పండినవొ! చక్కగ
నీకు స్ఫురించినట్టి - పే
ర్లన్నియు మోహనమ్ములు సుమా!
మఱి మోహనమూర్తి వీవుగా.... 61

గోగినేని పురంబున కోట్లువెట్టి
కట్టిన మహలుకే జగాజెట్టియునిఁక
నొక్క పేర్వెట్టి నోరాడకున్ననాడు
మోహనా ! నీదు పేర్వెట్టి మురిసితయ్య! 62

తీయని నీ వాక్కున మై
కాయాఫీసునకు నీవు కమ్మగ త్రిజగ
చ్ఛ్రేయమ్ముగ మోహన్ మై
కాయెకోన్పర్టింగు హౌసుగవచించితివా! 63

నీవు వచించినట్టి కమనీయకళా
రమణీయ దివ్య బృం
దావన పారిజాత సుమనప్రియ
మోహనమైన నామ సం
భావనజేసి జీవియసునాయఁడు
క్షీరసముద్రుఁడై చిరం
జీవులఁజేసె మిమ్ము విలసిల్లెడి
మేలిమితోడ మోహనా! 64

కమలాసీనుని తల్లియై శుభకళా
కల్యాణియై చంద్రరా
పుమ పుత్రీమణి జీవియస్ప్రభుని
వీరోత్సాహ సౌందర్య జీ

వముగా సర్వఫలప్రదైక ధరణీ
భాగ్యంబుగా పల్లవిం
చె మహాకల్పమహీరుహ ప్రసవ
లక్ష్మీరత్నమే మోయనన్.... 65

వెన్నెల వెండిరేకులు చివిర్చిన
నందనమందు సర్వ సం
పన్నకళా సరోవర సువర్ణ
మృణాళ మరాళ కోటిలో
మిన్నగ చంద్రరావమ నిమీలిత
పద్మప్రఫుల్ల నేత్రయై
పెన్నిధులిచ్చె మేలిమిగ వెంకట
రావుమతల్లి నోముతో.... 66

ఇంతటి గోగినేని కుదురిట్లు
చిగిర్చి తలిర్చి పెద్దసా
మంతుని వెంకటేశ్వరుని మాలిమి
యల్లునిగా గడించి, ది
గ్దంతుల దంతముల్ పులియగా
విలసిల్లెను పిచ్చయాఖ్యుఁడీ
యంతి పురమ్ములందు బసవాంబిక
నోములపంట పోయగా.... 67

జీవియన్ నాయుడిగారి కన్నతల్లి

బసవాంబా! రసమాధురీ గుణ
కదంబా! నీవు మున్నెట్టి క్రొం
బసిఁడిం రాశిగఁబోసి సుందర
సుపర్వశ్రేణి పూజించితో!
వసుధైక ప్రభుసౌఖ్య మందిరములో
వర్ధిల్లి కోడండ్రు, మే
లి సుతుల్, మస్మలు, మన్మరాండ్రిడిరి
కల్మిం చిట్టి ముత్యంబులై 68

చిన్నబ్బాయిగారి కన్నతల్లి

సకలైశ్వర్యములెల్ల నీకడుపులో
చంద్రాంబికా! చంద్ర సూ
ర్యకళాకాంతి సుఖైక సుందరములై
రాజిల్లి వజ్రాల ర
త్న కిశోరుండగు వెంకటేశ్వరుని
విన్నాణంబుగా నిచ్చె తె
ల్గు కతల్ మన్మలు, మన్మరాండ్ర కవితల్
కోడండ్ర మేల్ కుల్కులోన్.... 69

పఱచిన పచ్చని పట్టుతివాసిపై
నీ పైరకన్య మాణిక్యపూజ
ఆవు ముత్తైదువులడుగఁ పూచినచోట
నీ గృహలక్ష్మి పన్నీటి కడవ
క్రౌంజిగురాకు గీతాంజలి తళుకులో
నీ కుదురు సిరి మంజీరరవళి
ప్రణతులందిన నవరత్న తోరణములో
నీ పైడి గుమ్మాల నీటుగోటు
వడ్డికాసులవాని పర్వతముకంటె .
మానికొండ బంగరుకొండ మాడ్కిఁ జేసి
వెంకటేశ్వఁని. వరాలబిడ్డనిచ్చె
చక్కఁగా ధన్యురాలైతి చంద్రమాంబ! 70

తన పినతండ్రి జీవియసుధర్మ
నృపుండిల మాధురీజగ
జ్జన ఘనుఁడై మఱెంతటి ప్రశాంత
లతాంత నితాంత ప్రేమ పా
వన మృదుపాణితో చిఱుతప్రాయము
నుంచియు పెంచెనో! భవ
త్తనయుఁడు వెంకటేశ్వరుఁడు దక్షుఁడు,
ధన్యుడు చంద్రమాంబికా! 71

చిన్నబ్బాయిగారి ధర్మ పత్ని .

ఏ విఱజాజి పూలను మఱే సుకుమార
కళాకిశోరి వీ
ణావనమాఘురీ శుక నినాద వివాద
పికస్వరైక పూ
జావిధి వెంటటేశ్వరుని చక్కని
నామనిగా సరోజినీ
దేవి ! పరిగ్రహించితివా దేవత
లాశిషముల్ ప్రవర్షమై.... 72

నీ విమల ప్రసూన రమణీయ
మనోధన వజ్రలక్ష్మి నె
త్తావులు ప్రోవు ప్రోవులయి. దైవ
సహాయము లై సరోజినీ .
దేవి ! త్వదీయ భర్త కులదీపకు లైన
వరాల శ్రీ చిరం
జీవులు నీదు నోముసిరి చెల్వాలు
కొల్వులు(దీర్చియేలెడిన్.... 73

జీవియస్ నాయుని యశేష దేవతాకృ
పాకటాక్ష విశేష సౌభాగ్యములకు
యింత సూరెడ్డివారేమిటింక, వాసి
రెడ్డివారును వియ్యమర్థింతురయ్య.... 74

సుతపెన్ సంస్కృత మభ్యసించ౯టి
మా సూరెడ్డి యంజయ్య యెం
తతపస్సుం ఘనుపండఁ జేసుకొనెనో
నవ్యప్రపంచంబులో
నతి లావణ్య కళా సరోజినికి
మామై జీవియస్ నాయఁడు
న్నత భాగ్యంబిదె నీకు మెచ్చుకొన
మిన్నల్ వెంకటేశప్రభూ! 75

ప్రాణసమానమౌ తెనుఁగు రాణినిఁ
గన్న వరాల తండ్రి! వి
న్నాణములైన జీవియసు నాయుని
మేలిమి కీర్తి పంచ క
ల్యాణి శుభప్రదర్శనములందు
నిదర్శనమూర్తి! వీరమా
గాణము మోసి మున్ను నిను౯గాంచిన
శేషుని పుట్టువెట్టిదో! 76

వినుఁగని జీవియస్ ప్రభుని నిర్మల
ధర్మ సువర్ణరత్న పా
వనమృదుపాణిపల్లవ కృపారస
మావురికిచ్చినట్టి శే
షుని మఱి నీ వెరుఁగని కిశోరుఁడ
వైనను నీదు జ్యేష్ట పు
త్రునికిల తండ్రి పేరిడి సిరుల్
కురిపించితి వెంకటేశ్వరా! 77

విన్నాముగాని పృథ్వీపతుల చరిత్ర
చవులెఱుంగవు మాదు చెవులవేమొ!
కన్నాముగాని విఖ్యాత దాతలనెల్ల
కఱవు పోలేదు మాకనులకేమొ!
తిన్నాముగాని మృష్టాన్నమ్ములెన్నియో
వెలితిగనుండె మాకడుపులేమొ!
ఉన్నాముగాని మహోన్నతనగరిలో
హాయిలేదింత మాయాత్మకేమొ;
ఈ యసంతృప్తి జీవితాధ్యాయములకు
జీవిస్నాయుని యశోవిశేషమేమొ!
నిజపవిత్ర సంతాన మందిరములోన
పెన్నిధులు దొరికెను చిన్ని వెంకటేశ! 78

జీ వి య స్ నా యు డు గా రి ధ ర్మ ప త్ని

అసమాన ప్రభవెల్గు జీవియసు
నాయండెంత ధన్యాత్ముడో!
పసుపుం గుంకుమరాశిలో తళుకు
రవ్వల్ నీ యదృష్టంబులై
వసుధైక ప్రభువీర సంతతిని
చల్వల్ లోగిటన్ గంటి; ప్రే
మ సుధల్ వెంకటరావుమాంబ!
చిఱుమన్మల్, మన్మరాండ్రియ్యగా .... 79

ధనముల్ కల్గిన సంతతుల్ కొదవయై
తద్భాగ్యవంతుల్ సుఖం
బును పొందం గతిలేని వారయిరదేమో!
కోడిసంతానముం
డినవారల్ తినతిండిలేక పడిరీ
నిర్మాణ మేదిక్కుదో!
తనరెం వెంకటరావుమా! ధనము
సంతానమ్ము నీనోముతో.... 80

అత్తకు, మామకుం సుఖము హాయిగ
　　నీదు హయాములోన మే
లత్తరు జల్లులో జరిగినట్లుగ
　　కోడల దండుచూచి జా
గ్రత్తగ సేవలో మెలగగల్గెను
　　వెంకటరావుమాంబ! నీ
పెత్తనమింత మెత్తనిది; ప్రేమకు
　　నీయెద యెంత మెత్తనో! 81

కులుకుచున్నది నీదు గోగినేని పురాన
　　బృందావనంపు టానందలక్ష్మి
పలుకుచున్నది నీదు పతిపాదముద్రలో
　　నూరుయుగాల బంగారులక్ష్మి
మెఱయుచున్నది నీదు మేలిసంతతితోడ
　　దేశదేశాల నదృష్టలక్ష్మి
మురియుచున్నది నీదు ముత్యాల ముగ్గులో
　　నర్తకిగ ప్రపంచకీర్తి లక్ష్మి
భువనమోహన సౌందర్య పుణ్యరాశి
యైన నీ పెద్దకోడలు ఆదిలక్ష్మి
యై త్వదీయ హర్మ్యమున ముందడుగు పెట్టె
రంజిలుదువంబ! వెంకటరావుమాంబ! 82

నీ విజయ పత్రశ స్తిమటి నీభువ నైక
సమస్త సౌఖ్యభా
గ్యావళి మేల్ పరిస్తితి సహస్ర
శతాబ్దము లేలునట్లు ప
ద్మావతి పెద్ద కూతురయి తావక
హర్మ్యములో జనించి ధా
త్రీవిభు వీరరాఘవుని దెచ్చెనె
యల్లుగ జీవియస్ప్రభూ! 83

హాయిగ పండువన్నెలయినట్టి
త్వదీయ సువర్ణ జాతక
చ్ఛాయలు చంద్రరావు సువిశాల
జగంబున వెల్గఁజేయ రా
ధేయుని వెంకటేశుని విధేయతఁ
గైకొని మీకు జీవియన్
నాయుఁడ! మేల్మియల్లునిగ నచ్చెడి
పచ్చతివాసిఁగొల్చెగా॥ 84

చిట్టి వరాలబిడ్డగ సుశీల జనించి
ఫలించినట్టి మేల్
పట్టు తివాసిపై పసిడి పచ్చలు
వజ్రములెల్లఁబోసి, నీ
పట్టిన పట్టునెగ్గుటకు వాస్తవపుం
విజయధ్వజమ్ము కేల్
పట్టెను ఆంజనేయుని కృపం;
కొదవేమిటి? జీవియన్ప్రభూ! 85

కుందేరు సోదరాత్మకు
విందెప్పుడు సేయునట్లు విశ్వేశ్వరునిన్
కందోయి ముందుఁజేర్చితి
పెందయతో గోగినేని వెంకట సుబయా॥ 86

చాముండేశ్వరి బెంగుళూరున
భవత్సాన్నిధ్యమం దుండి ల
క్ష్మీ మాణిక్య సువర్ణరాశులను
వీక్షింపంగ లక్ష్మీశ్వరీ
శ్రీ మందారకళా ప్రసూనధనరాశిం
కందలం పాడులో
స్వామీ! వేంకటరావుమాంబ
కొలిపించం బొచ్చె పాలించుడీ॥ 87

పేర్మి గోగినేని వెంకట సుబ్బయ్య
నాయఁడొకడె సర్వశ్రేయములకు
అయ్యఅమ్మై జీవియన్ నాయఁడై నేఁడు
మణులకొండ కాఁగ మానికొండ. 88

తరములదుగునఁబడ్డట్టి దాతలేమొ!
కనులకడ దాతలకు తాతగా పెరిగిన
చందులాల్ముందు, సజనులాల్ ముందునేఁడు
జీవియన్ నాయఁడే రాజతీవిజూపె.... 89

అడిగినవానికెన్నఁడు సహాయము
సేయని రోజులేదు; గు
ప్పెడు వరహాలు గుప్పని నివేదన
లేదు! సమస్త సంఘముల్
పడు కడగండ్లిఁకం చెవినిఁబడ్డ
మఱుక్షణ మెన్నిరూకలో
నడుపని తేదిలేదు; మననాయుని
జన్మ మదెంత భాగ్యమో! 90

కవులకు వర్ణనంబులయి ఖాళిగ
చేతులునుండెగాని ని
క్కావముగ దానధర్మములు కోట్లు
విజృంభణచేయుచున్న నీ
దు వితరణైక హస్తములతో
తులతూగనటుల్ ప్రపంచ బాం
ధవులను గెల్చి జీవియసునాయుఁడ!
కీరితిమాల దాల్చవే! 91

మా కవి వర్ణనంబులు సుమాయివి
యంచు తలంచుకొందురే
మో! కనుఁడింక మేల్ భువనముల్వాయి
మీ భవనమ్ములీ సిరుల్
గై కొని పుణ్యవాహిని నఖండ
యశోనదులొాచు పొంగి మీ
వాకిట భంగిమంబులు నపారముగా
నొనరించె నాయుఁడా! 92

లక్షలు పోసిన యక్షర పూజామహత్తు
హైస్కూలు సాక్ష్యమ్ము నొకటి
కాల్వ త్రివేణి సంగమమయి గడపలో
నర్ఘ్య పాద్యమిడు సాక్ష్యమ్మనొకటి

బలరామకృష్ణుల భవనమ్ముగా ముందు
కట్టినమేడ సాక్ష్యమ్మొకటి
తమకారులన్ని స్వంతమ్ముగ వాడుకొంచు
గ్రామ ప్రజలిదు సాక్ష్యమ్మొకటి
యుష్మదనివార్య సద్యశో గ్రీష్మకాల
చండ మార్తాండ దివ్య తేజమునకింక
సాక్ష్యములు చాల గలవు; బస్తాలులేవు!
నీ యునికదేమొ జీవియస్ నాయుఁడయ్య! 93

లేగల మూతిఁగట్టి. యవలీలగ
బందమువేసి కాళ్లకున్
ప్రేగులుమాడ్చి. సర్వ పృథివీస్థలి
ప్రాణము నిల్పు క్షీరముల్
బాగుగపిండి. వట్టిదయి పాలిడ
కుండిన బాదిబైటకున్
లాగెడి గోవు జీవియసు నాయుని
వంకకుఁజూచె జాలితో.... 94

నాకిఁక దిక్కు జీవియసునాయుఁడు
　　దక్కమఱెవ్వఁడింక భూ
లోకములోన లేఁడని యెలుంగు
　　తెలుంగు గళంబు తోడ ము
ల్లోకము కర్గి సద్యళములో
　　కనికారము రంగరించి మేల్
పాకము గోవు తద్విభుని పందు
　　పెడందకు నింపెనేమొకో! 95

ఎటు వీక్షించినఁగూడ విశ్వజన
　　బ్రాహ్మీదేవితో నేఁడు నీ
స్ఫటికచ్ఛాయ విశాలసౌధ ఘన
　　శుభ్రజ్యోత్స్న లొల్కించి ది
క్తటముల్ ప్రస్ఫుటమైన త్వచ్ఛుభ
　　చరిత్రస్నేహ మాధుర్యముల్
ఘటియించెం; మఱి నేను చెప్పినవి
　　లెక్కా! జీవియస్ నాయుఁడా! 96

ఒకచేతం సుఖభోగలాలస
　　కళావ్యాపైక సంసార మిం
కొకచేతం కడు బక్కచిక్కిన
　　ప్రజాయూథమ్ముఁ జేఁబట్టి, తూ

నికచే రెండు సమత్వదృష్టి నిల
తండ్రీ! మూపుపైమోసి, నీ
సుకుమారత్వము మొక్కవోని దయ
రాశుల్వోయవే నాయఁడా! 97

ఆ నీలిమబ్బుల మేనాలలోరాణి
పన్నీటివాన మీపైనఁగొట్టె
ఆ వెండి కెరటాల దేవిడీలో రాజు
ముత్యాలరాశి మీ ముందు పోసె
ఆ కావ్యకిరణాల రాకన్నెలోవాణి
విజయగీతాలు మీ ప్రజకు నేర్పె
ఆ కోరమీసాల షోకులో కళలెల్ల
గుబురు జెండాలు మీ కోటఁగట్టె
ఆ మహావంశ సత్కీర్తికౌముదీ ప్ర
ఫుల్ల సౌందర్యమల్లికామోద కౌతు
కమున కమ్మకమ్మనివారు కమ్మవారు
కమ్మనివి మీకె రసికాగ్రగణ్యులారః 98

పదియొకరాలకింక నలువైపుల
కోటను లేపినట్టి వాఁ
డిదివరకెక్కడుండెనొ? మహీస్థలి
కెక్కిన మానికొండ మి
న్నది కనినట్టి జీవియసు నాయుఁడుఁ
గాక; మఱెట్టి బిడ్డమా
ముదితగ గోగినేవి పురముం
ధళధళ్ధళ కుల్కఁజేసెగా! 99

వాసి రాసి పడ్డనుగూడ వాసిరెడ్డి
వెంకటాద్రి నాయండు; మైకొంకమునకు
అధిపుఁడంచూరు సుబ్బనాయండయినను
జీవియస్ నాయఁడొక్కడార్జించెసిరులు.... 100

పరశురామునిచేతిలో పరశువెల్ల
మున్నురామచంద్రుడు గైకొన్నపగిది
నుర్వి నంచూరు సుబ్బనాయుని మయినుల
నాడు గైకొంటి జీవియస్ నాయుడయ్య 101

గోయి విధాన సందలపు గుంటయి
యీ రవి క్రుంగనట్టి యాం
గ్లేయ ధరాతలేంద్రులటు లేవిడియై
విడినట్టి మైనులో

నీ యతి సాహసాన డగి నేఁడు
మణుల్ కనుచున్న జీవియస్
నాయుఁడ! నీ కసాధ్యము కనంబడ
దీ జనసేవ లెక్కయా! 102

ఏ మేధానిధి చూపుకందని జగా
లెన్నెన్నియో మున్ను నీ
'షా' మైకాగనిలో సహస్రమహ
దైశ్వర్యంబులై పండి యె
న్నో మాణిక్య సువర్ణరాశులయి
కన్నుల్పండువుల్జేసి సు
త్రాముం పెద్ద గవర్నరుం నిలిపె
చెంతం జీవియస్నాయుఁడా! 103

ఈ గనిమించినట్టిదిల నింకొక
టిచ్చట 'పల్లిమెట్ట' మై
కాగని లభ్యమైనది: యఖండ
మహాధన వజ్రచాతురీ
యోగమువట్టి తావక మహోజ్వల
కోటి యదృష్టరేఖలన్
త్యాగములింక జీవియసునాయుఁడ!
చేతువయా శతాబ్దముల్ .... 104

నానాశ్రీలు నుతించు జీవియసు
ఘూనాధుఁడ! అంచూరు సు
బ్బానాయందొకఁడిన్ని కోళ్లెపట
కుప్పల్ త్రవ్వి యార్జించెనో
దానిం 'నందలగుంట' మైననిరి;
అద్దానిం మతీవెట్లు ఘో
రానీకమ్మెదు రై గడించితివొ
పీరాస్వామి కోళ్లెత్తగా.... 105

ఏ రారాజును లెక్క సేయని
ఘనుండేగొప్పతో నేఁడుసేన్
పీరాస్వాములు గోగినేని పురముం
వీక్షించెనోగాని, యా
పీరాపేరనుఁగూడ మైనువెలసెం;
వేలాదిగా కార్మికుల్
నీ రాజ్యాన సుఖించు చుండెదరు
తండ్రీ! జీవియస్నాయుఁడా! 106

అటు గూడూ రిటు మానికొండ
సరిహద్దైయున్న భూఖండమం
దెటు కన్నెత్తిన నింక నీ కెదురు
లే దీనాడు నేనాడు వెం
కట సుబ్బయ్య సునామధేయ!
శతలక్షల్ కోట్లు వెచ్చించి నీ
విట కట్టించెద వా హిమాలయ
గృహా లెన్నెన్నియో ప్లాన్లకై.... 107

అసలీ వెచ్చట కాలుమోపినను
బ్రహ్మాండంబుగా వెండికొం
డ సొరంగంబులుఁ గానవచ్చుఁగద;
విన్నాణంబుగా నీ సుధా
బ్జ సుగంధాంచిత పాదపల్లవము
సుబ్బయ్యాభిధా! మోవుచో
నిసుమాత్రంబిల యుండదేమొ
మునుముందింకొక్క మార్కెట్టుకై.... 108

భూగోళంబిక యుష్మదీయ
　　చరణాంభోజాలచే పెద్ద మై
కా గోళంబయిపోయి త్వద్ఘన
　　జగత్కల్యాణ నిర్మాణ వి
ద్యాగీర్వాణముతోఁ బసిండి
　　భువనంబై తేలు నిస్సంశయం
బో గోపాలక చక్రవర్తి!
　　కవితా భోగైక ధాత్రీపతీ! 109

నీ బంగారుపదమ్ముల
ప్రాబల్యము బెంగుళూరు బంగారుగనుల్
రేఁ బసలు కల్వరించుచు
నేబాసుగఁ బట్టెనయ్య జీవీ సుబయా॥ 110

ఇచ్చితమైనమాటయిది ఖాయముగా
　　కమనీయరాశి మే
లిచ్చెడి బెంగుళూరున గ్రహింతువ
　　మింతువు; మూడుకోట్ల పె
ల్లచ్చరదండ్లు నీవెనుక హాయిగ
　　దిగ్విజయైక భేరినిన్
వచ్చెదరయ్య జీవియసు నాయుఁడ!
　　తావకభాగ్య మెట్టిదో॥ 111

కోటిస్వర్గము లెన్నియో కోట్లువెట్టి
తెచ్చి నాటినట్లుగ నీవు లచ్చలొంచి
మైనులన్నిట మెట్లు రమ్యముగఁగట్టి
జీవియస్ నాయుడా! చిరంజీవివైతి.... 112

ఈ యతి వైభవంబున మఱింత
దిగంత యశోవిశాల రా
ధేయుఁడవై వెలుంగుచు విధేయుఁడ
వై తివదేమొ; జీవియస్
నాయుఁడ! నీకుసాటి భువనత్రయ
మందున నీవెగాని యే
రాయలు ఫామిలీ దొరలు ప్రక్కకు
పోలరు నీదుఠీవితో.... 113

ఇయ్యెనలేని పుత్రుని మఱెవ్వఁ
డదృష్టము పండిగాంచెనో!
తియ్యని తియ్య తియ్యని తదీయుని
పేరది యెంత తీపిదో!
ఇయ్యనఘాత్ములైన ధరణీశుల
కంటెనటన్న పేరు పి
చ్చయ్యగఁ దేలె నీ జనకుఁడైన
మహాత్ముఁడు జీవియస్ ప్రభూ! 114

ఒక చోటేమిటి? మానికొండపయి
మీరొక్కంత నిల్చుంది మి
న్నక వీక్షించిన కన్పడుం పుడమి
నీ నాడింక హైస్కూల్సు: రూ
ల్సుకు, మాస్కేల్సుకు మిన్నగానె
నెలకొల్పుం జీవియన్ నాయఁడిం
దుకు సైదాపురినెత్తె గోపురము
సంతోషాన హైస్కూలుకై .... 115

భువనము లేలుచుండిన ప్రభుల్
వెనువెంట షికార్లుసేయు గౌ
రవ ప్రతిభాప్రభావ శుభరాడ్గురు
దేవుఁడునేను పేర ని
క్కువముగ దిగ్భ్రమల్ పడెడి కోటి
యదృష్ట సువర్ణరేఖ సం
భవుఁడయినట్టి జీవియసునాయుఁ
డజేయుఁడమూల్యకీర్తితో.... 116

కులమర్యాదలు విల్వగా విరుగు
పౌర్గుల్మొందు విఖ్యాతిగా
తల యెత్తంగల బాహాటే కొలుకు
చేతంలేక మున్నుంది, క

ల్మలు నేఁడొల్కఁచు తెన్గుతల్లి తొలి
నోఘుల్ తోట పుష్పించె రా
యలుకోటీశ్వరుఁడైన జీవియను
నాయండిచ్చు భాగ్యంబుతో.... 117

ఇది విద్యాలయ జన్మవైభవ
కళాహేలా విలాసైకది
వ్యదశానంద ముహూర్త భాగ్యమిది;
నేఁడత్యంత ప్రాముఖ్యమై
నది; యద్దానిని పిచ్చయాభిధుని
సౌజ్ఞం జ్ఞాపకార్థంబుగా
గద నెల్కొల్పిరి జీవియస్ విభుఁడు
చుక్కానౌచు సాగింపగా.... 118

జగమున మానికొండయిఁక చక్కని
చల్లని గోగిసేవి కొం
డగ విలసిల్ల జీవియసునాయుఁడు
యుష్మదఖండకీర్తితో
నిగనిగలాడుచున్న ధరణీ తరుణీ
మణి కొన్ను దిక్కుమ్రొ
క్కఁగ ఘన పాతకాల నెలకొల్పితి
వయ్య వివేక లక్ష్మికై.... 119

ఒక పుణ్యాత్ముని జన్మతో విధుసుధా
జ్యోత్స్నా మహోత్సాహ ది
వ్యకళా వైభవరాశి లోకములపై
వ్యాపించుచున్నట్లు తా
వక జన్మంబున మానికొండ ధరపై
వజ్రాల గంధర్వపు
ష్పకమై వెల్గె విధేయుడై ప్రభులు
మెచ్చం జీవియస్నాయుఁడా! 120

ఈ షైకాజగదేకవీరుఁడు
కళాహేలావిలాసైక సు
త్రామశ్రీ రసికావతంసుఁడు
మతేప్రాగ్వైభవారామవ
ల్లీ మాణిక్య రసాల సౌఖ్య ఘన
కేళీ లోలుఁడై జీవియస్
నామాలంకృతుఁడయ్యెనో! యితని
మించంలేఁడెవండెచ్చటన్ 121

తిరమౌచున్ నవరత్నరాసులను
సందేహంబులేదింక పెన్
గిరిగాఁబోతువు జీవియస్వార!
యునేస్ పీఠా త్రిలోకైక స

ద్గురు వీ నా నుడులందు నిల్చినుడివెన్;
దుర్భేద్యమైనట్టి బం
గరు ఖండంబును బట్టుకొందువు
జగన్నాథుండు ప్రత్యక్షమై.... 122

ఈ తెలివైన గడ్డను మఱెక్కడ
లేని సిరిం సృజించి సం
ప్రీతిగ రామచంద్రుఁడు వివేక
ధనుర్బల వీర విశ్వ వి
ఖ్యాత కుమార మేరువుగ గైకొని
నీకిడు నింక జీవియస్
భూతలనాథ! నీదు పదముల్
ముదముల్ భువనైక భాగ్యముల్.... 123

మురళిని కేలఁ బట్టుకొని ముజ్జగ
మేలెడివాని లక్ష్మి బం
గరు చిఱుగజ్జెలందియలు ఘల్లన
ఘల్లన గంతు వేసి న
న్నరయుచు మేలుకొల్పి మఱియు భ్రకపుం
సిరి పెద్దపెద్ద దొం
తరలు నునేనుపీర కరుణన్
పరపించెను జీవియస్ప్రభూ! 124

చల్లని మల్లెపందిరి పసందుగ
పూచిన మాడ్కి యీజగం
బెల్లెడ త్వద్యశోవన మహీ
మహిళామణియౌచు, సీతనూ
వల్లరి పుల్కరించెడి నవాబు
మతాబుగ పల్కరించి రం
జిల్లిన రాణికంటె నగిషీలడి
నాసుత; జీవియస్ ప్రభూ! 125

చల్లచల్లని చల్లపల్లి వనమ్ములో
పున్నాగపూలెగఁ బోసికొనుచు
గడుసు నడుసున ద్రొక్కడుసుమిల్లి పొలాన
గొబ్బిపూలను జాల కోసికొనుచు
ఉయ్యాల నొయ్యార ముయ్యాకు కోటలో
ముసినవ్వుతో నొల్కఁబోసికొనుచు
పాట పన్నీటి కవ్వపు కోటగశిటట్టి
కుల్కు తళుక్కున తేనె చిల్కుకొనుచు
చెంగుచెంగున గంతులు చిందులింక
త్రొక్కి, నీదు చక్కదనాలు దొంగిలించి
నాదు చిన్నికమ్మని కవనాలరాణి
జీవియస్ నాయుడా! నిన్ను జేరునుబెట్టె! 126

నరపతు లెందఱో మఱియు
నా కవితా లలితాంగి నీలి ముం
గురులు శిరీషపేశల వినూత్న
మనోజ్ఞ తటిత్తనూకళా
ధర మధురామృతమ్ములు ముదమ్మగ
తావక దివ్యమైన మేల్
పురులకు, కౌగిలింతలకు, ముద్దుల
కోర్చును జీవియాస్ప్రభూ! 127

శుభ సౌందర్య జగజ్జనార్య ఘన
రాజోత్తంస భాగ్యోదయా!
ప్రభువంశోన్నత జన్మవై భవ
యశోవాల్లభ్యసౌలభ్య ది
గ్విభరాణ్మండల జీవియస్ విజయ!
త్వత్కీర్తి ప్రపంచైక వా
గ్విభవారామము నేఁడు పిచ్చయను
జూపెం గల్పవృక్షమ్ముగా.... 128

రతనాలచేనులో రైతురాజోయి
పెళ్లి సందళ్లలో పిచ్చిపాపాయి
వెలయేటి తోట్టిలో
నెలబాలుఁడోయీ
తొలికోడి కూఁతలో
ఇలువేలుపోయి
రతనాల సృష్టిలో రైతురాజోయి
పెళ్లిపందిళ్లలో పిచ్చిపాపాయి
తొలకరి లక్ష్మిలో
తొణకించు సిరినోయి
తూర్పారబోసినా
దొరబిడ్డఁడోయి
రతనాల సృష్టిలో రైతురాజోయి
పెళ్ళి పందిళ్ళలో పిచ్చిపాపాయి
భువనాల బొజ్జలో
అవతారములకోయి
దిక్కుగ్గ మొక్కైగనట్టి
దేవుఁడితఁడోయి
రతనాల సృష్టిలో రైతురాజోయి
పెళ్ళి పందిళ్లలో పిచ్చిపాపాయి

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ